శ్రీ ర స్తు.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః.

బృహదశ్వరాజసంవాదరూపంబును

శ్రీమద్రాఘవాచార్యకవివరప్రణీతంబును

కలికల్మషనివారకంబునగు,

# నలచరిత్రము-ద్విపద కావ్యము.

ఇది,

సత్యాంశోపయుక్తంబగునటుల

పండితులచే బరిష్కరింపఁబడి

ర. 4

శ్రీ చెన్నపురంబునందు

## బి. వి. రంగయ్య శెట్టిగారి

స్వకీయ

శ్రీలక్ష్మీనృసింహవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

19-5-11.



శ్రీరస్తు.

# నలచరిత్రము - ద్విపదకావ్యము.

ప్రథమభాగము.



క॥ శ్రీరమ్యధర్మనిత్య । ప్రారంభవిభాసిరాజ్యపరమేశ్వరఘో
రారిమదకుంభికుంభవి । దారణదారుణకృపాణదక్షిణహస్తా॥

శ్లో॥ శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతోవక్షోముఖాంగేషు। యేలోకానాంస్థితి
మావహంత్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం। తేవేదత్రయమూ
ర్తయస్త్రిపురుషాస్సంపూజితావస్సురైః। ర్భూయాసుఃపురుషోత్త
మాంబుజభవశ్రీకంధరాశ్శ్రేయసే॥

— రాజ్యంబులోడిన పాండవులయొద్దికి బృహదశ్వుఁడేతెంచుట. —

సలలితసాంద్రశబ్దసంగతుల। వలెనొప్పనలచక్రవర్తిచరిత్ర। విరచింతు
నానేర్చువిధమెల్ల దెలియుఁడు। కరమొప్పఁదత్కథాక్రమమెట్టిదనిన। పరమపావ
నుఁడైనపాండునందనుఁడు। ధరయెల్లఁగల్లజూదంబుననోడి। కౌరవాగ్రజుపాలు
గావించిదైత। ఘోరాటవులకుపోక్కుచునేగియచట। తనతమ్ములనుదానుతన
కూర్మిసతియు। మునివేషము దాల్చిమోదంబుదక్క। విహరింపుచుండిరివిధివ
శంబునను। మహిమతోడనుభూమిపైనిన్నవలది। అరుదైనరుద్రాక్షహారముల్
వేసి। యురవుకెంజెడలెల్లయొగిచుట్టుగట్టి। పరగకృష్ణాజినాంబరముధరించి। కర
ముజెన్నొందగాకమండలవు। ధరియించిజపమెన్న దన్నచేనుంచి। పరువడివరయో
గపట్టెధరించి। ఘనతరంబుగపాదుకలు వేడ్కమెట్టి। కరుణతోవేంచేయగాజూ
చిపాండు। తనయుండుతమ్ములుతానువేగ। జనుదెంచిఎదురుగాసంయమీ
శ్వరునిచరణాంబుజములకుచయ్యనమ్రొక్కి। యరుదుగానర్ఘ్యపాద్యాదిసత్క
ర్మవితతులబూజించివినుతులుచేసి। యతిభక్తిగొనివచ్చియవాసనమున।
నునిచిచేతులుమోడ్చియురుతరభక్తి। ననియెనుమునితోడనారాజవిభుఁడు। ప
రమయోగధ్యానపావనజ్ఞాన। చిరదయానిధిమీకుక్షేమమేయనిన। వినిము
ద్రుడుధరావిభునకిట్లనియె। జననాథనీవంటిసత్యసంధున్నుగలుగుటక్షేమంబుగ
లుగుగాక। యిలక్రమంబులుమున్నియేటికివచ్చి। ధరణీతలేశనీతరములునీవుపరి

ణామమే మునిపరికించి చూడగ। మనమున జింతించి మరి పాండుసుతుడు। దనమ
దిదెచ్చి యత్తపసికిట్లనియె। దేవదయాసాంద్ర దేవేంద్రవంద్య। యీవేళమా
సౌఖ్యమేమనవినుము। కపటజూదంబున కౌరవేంద్రునకు। విపులసంపదలెల్ల
విడువంగగలిగె। నదియాదిగాగ యీయరణ్యభూమి। కుదమెల్లదక్కి యీము
దితతో గూడి। తమ్ములు నేను నుతపసివేషంబు। నిమ్ములధరియించి యిట్లుండగ
లిగె। నాకటివేళకు నన్నంబు లేక। నాకులు కాయలు నరసి భక్షించి। దినమొక్క
యేడుగా దీనతబొంది। యెసిసీయడవిలో నిట్లుండగలిగె। పరతెంచి యిష్టదిక్ప
తులునునయిన। ధరలోన సాధింపదగిన సోదరులు। శూరత్వములు మాని సు
ఖములుడించి। ఘోరాటవులలోన గూర్చుండవలసె। ద్రుపదనందన యిట్టిదు
ర్దశనొందె। విపులశోకంబున వేగింపగలిగె। చిత్రశయ్యలయందు జెలగి నిద్రిం
చి। వస్త్రశయ్యలయందు పవళించగలిగె। సంగీతవిద్యాఘోషంబులాలించి। సిం
గంబు కూతను చెవియొగ్గగలిగె। నలువైన సింహాసనముల గూర్చుండి కొలదికే
క్కగరాల గూర్చుండగలిగె। నారామసీమల నలవర్తించి। యారణ్యసీమల నడ
లంగగలిగె। హితవుగతన పురోహితులతో నుండి। మితిలేని మృగముల మెలగం
గగలిగె। వెలలేని కర్పూరవీడెముల్ జేసి। నలసియాకులు బ్రవేళ్లనమలంగగలి
గె। జాతిగంధము నే సరివితో బూసి। భూతిగంధము మేనబూయుంగలిగె। ని
టువంటి సుఖములకిపుడైతిమయ్య। కటకటా దయలేక కౌరవాగ్రజుడు। యెరు
గక నిటుచేసె నేమనవచ్చు। పరమయోగీంద్ర నాభాగ్యమిట్లుండు డెపుట్టిపోయి
నవారు పుట్టినవారు। పుట్టబోయ్యేవారు భూలోకమునను। దాయాదివారిచే
ధరయెల్ల నోడి। పోయి మావలె వనభూమిలో నిట్లు పొంది యీవెతలను బొంది
నవార। లెందైన గలరె మీరెరిగినయెడల। ననవుడు మునిచంద్రుడా రాజు జూచి
ఘనకృపారసము లుకంగ నిట్లనియె। ఇది యేమి జననాథ యింతగా నీవు। మదిలో
నయిట్లాడ రచి తేసితి। పోపొమ్ము మరియేమి బుద్ధులు మీరు। ప్రాపించి చింతిం
పపని లేదు వినుము। తొల్లి జేసిన యట్టి దుష్టకర్మమును। నెల్లపొందక విధియేల
పోనిచ్చు। కమలాదిధరునకు కమలగర్భునకు। కమలేశునకు శతక్రతునకునైన
కొన్నాళ్లు దుఃఖంబు కొన్నాళ్లు సుఖము। కొన్నాళ్లు లేమియు కొన్నాళ్లు కలిమి
వసుమతి సమముగా వర్తింపుచుండు। వసుమతీశ్వర యింతవగపేల నీకు। నదిగా
కవ దుఃఖమందితి రిలను। ముదమొప్ప మావంటి మునులు మీకడకు। చనుదెం
చి నిత్యము సకలశాస్త్రములు వినుపించెద మమీకు వేశ్వేరనింక। తమ్ములు బా

సిత్రోతరుణి బాసితివో। సమ్మతిగాని వేషములు జెందితివో। కడిపురంబున నీవు క్ర
మముతో నున్న। వరుసతో నచటికి నెత్తుము మేము। పుణ్యవేళలయందు పుణ్యతీ
ర్థములు। పుణ్యుడై గుర్తించు పుణ్యముల్ జేసి। పితృవేళలయందు పితృకాల
ములను। నతిభక్తితో జేసియఘములుద్రోచి। ఇటువంటి సుఖములకిరవుగా
నుండి కటకటా నీవు శోకము జెందదగునె। వసుధ నాపదబడ్డ వారలలోన। పొనగ
నేయాపదబొందితివిపుడు। జననాథునీకింత సన్తాపమేల। వినుము చెప్పెద నీకువి
శదంబుగాను। నవనిలో నలనాథుడను మహారాజు। ప్రవిమలసత్యసంపన్నుడగ
నుడు వినుతి కెక్కిన బాహువిక్రమోన్నతుడు। వినయభూషణుడతివిమలమా
నసుడు గురుభక్తినిరతుడు గుణవిశారదుడు। కరుణాపయోనిధి గాంభీర్యధను
డు। ధరణి షోడశ మహాదానవినోది। యమరుడై నసకలశాస్త్రార్థకోవిదుడు।
చిరపుణ్యమతి వీరసేనసుతుండు। ధరణిపంశజుండు కందర్పసన్నిభుడు। నిరుపమ
విజయుండు నిషధేశ్వరుండు। పరమపావనుడు శ్రీపతిభక్తియుతుడు। సురరాజ
విభుడు భూసురవర్ణనీయుడు। డరిబలహారి మహానలుండగుచు। నలుని పట్టపురా
ణి నలినాయతాక్షి। అలివేణి దమయంతి యను నెడియింతి। పరమపతివ్రత బహు
గుణాభరణ। కరిరాజగమన చక్కని చంద్రవదన। తనయుడు వంశవర్ధనుడొక్క
రుండు। మనుజేశ్వరునకు కొమార్తె నొకతె। నిలనేడుదీవుల నేలెడు రాజు। వ
లనొప్పు పుష్కరవసుధీశుతోడ। నవనీశనీవు లెన్న వ్యాజమున జూద మవిరళంబుగ నా
డియట మోసపోయి। పురవరంబెడబాసి భూముల బాసి। దొరలను బాసి ఘన
రథంబుల బాసి। గజముల బాసి ధనముల బాసి। ప్రధానుల బాసి వరపుత్రులను
బాసి। వనితను బాసి పరమాప్తులను బాసి। భటకోటి బాసి సకలబంధుల బాసి స
కలంబు బాసి। చకితాటవుల కేగి చానతో గూడి। కట్టబట్టము లేక కాంతపై
కొంగు। కట్టుక నడవిలో గడు దుఃఖమునంది। యాకలి చేచాల నలజడిబడుచు। నాకు
లుకాయలు నలములు భక్షించి। కలిరాజు పన్నిన ఘనమైన మాయ। తెలియకిద్ద
రు రెండు తెరవుల బట్టి। తరలాక్షినెడబాసి ధరణీశుడేడల। ధరణీశు నెడబాసి తర
లాక్షి యెడల। తమ్ముగొల్చిన వారితా మసేవించి। యిమ్ములనుండిరి యిలగొంత
గాల। మరిగిన పిదప శ్రీహరికృప జేసి। నుసు రాజ్యసుఖము సనుండిరి తొల్లి। యా
దనహస్త్రాంశమైన సుగలవె। యిందువంశజనికు నెనసిన కష్ట మనవుడ త్యాశ్చ
ర్యమందియా రాజు। ఘనభక్తిముని రాజు గనుగొని పలికె। వరముని నాథనా
వలె నలాధిపుడు। ధరయెల్ల కల్ల జూదంబున నోడి। యిటువంటి నడవికి నే... గి

బోయె। తటుకునయుట్టి జూదంబులు మున్ను। గలిగియుండుటబూనె కౌరవాధి
పుడు। తలచిపల్మారు దూరదగదింకె నలుని। చారిత్రమంతయు సాంగంబుగాను।
గారవంబున వినకడు వేడ్కవుట్టె। వినుపింపుమనిన భూవిభు జూచి మౌని తనమ
లో బృహదశ్వమహర్షి। యానందమును బొందియుండంద మెచ్చి। ధ్యానిం
చి నలునిసత్కథ చెప్పదొడగె.



శ్లో॥ కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ।
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్॥

బృహదశ్వుడు పాండవులకు నలునిచరిత్రము చెప్పుట.

నిరుపమగతినొప్పు నిషధాపురంబు। సురయుగమతికెక్కినట్టిపట్టణము। శ్రీక
రనవహేమచిత్రగేహములు। ప్రాకారగోపురప్రాసాదతతులు। కనకంపుమేడ
లుఘనమంటపములు। వినుతింపదగినట్టి విపణిమార్గములు। కోటలుయట్ట
ళ్ళుకొలువుకూటములు। నాటకశాలలు నలినదీర్ఘికలు। కేళికావనములుకృత
శాచలములు। బాలానిలంబులు బహుపుష్పములును। మహనీయదేవతా
మంటపంబులును। బహుచిత్రగతుల చేబరహర్మ్యములు। శృంగారవనము
లు చెరుకుతోటలును। సంగీతనిలయములు స్సరములుమరియు। రంగుమీరిన
యట్టి రజితశైలములు। చెంగావిటెక్కెము ల్చిత్రశాలలును। కొమరార
ముత్యాలగొడుగులుమఱియు। కమనీయచక్రసంగతకనాటములు। వారణ
శాలలు వాజిశాలలును। మేరుశైలముకన్న మించు తేరులును। పచ్చతోరణ
ములుబహువిలాసములు। నచ్చుశాగొప్పముత్యములముగ్గులును। విమలభూ
షణమునవిహరించుహరులు। నమరభూజములతో దనమరినతరులు। వారాశి
కిరవైన వనతటాకములు। చాతురత్నంబుల సౌధవాటికలు। వేదశాస్త్రపురాణ
విద్యలన్నిటికి। యాదియైన ర్తించునట్టిభూసురులు। రాజులుబలపరాక్రములు
రాహుతులు భూజనమతులైన బుధులు శాంధవులు। ధనదునిపురినైన ధర
యెల్లచూర। కొనిదాచగలవైశ్యకోటిచెన్నొంద। హరిభక్తియుక్తులైనట్టి
శూద్రులును। సరసులుసత్కవీశ్వరులు పాఠకులు। కాముకులును వారకాంతా
నంబు। కామితార్థములెల్లగలుగునంగళ్లు। నానావినోదము ల్నడుపునా
టకులు। మానితపతిభక్తియుతులైనసతులు। దురమునమించినమగలును మిగు
మదగజంబులనిల్పుమల్లులుగలిగి। పురుహూతుడేలినపుర మొకోయనగ।

ధరణిదేవికిముఖదర్పణం బనగ। పురములకెల్లనుభూషణంబగుచు। నిరుపమ
గతినొప్పునిషధాపురంబు।అప్పురాధీశ్వరుడమలమానసుడు।భూపాలచంద్రు
ఁడుభుజబలోన్నతుడు। గర్వితపరగజకంఠీరవుండు। సర్వజ్ఞుడత్యంతసాహసోన్న
తుడు।నాకేశనుతకీర్తినలచక్రవర్తి।యేకచక్రంబుగానేలుచునుండె।వారక
నెలమూడువర్షముల్గురియు। జారులుతేరనాచారులులేరు। విరసంబుతీరి
పెంబువెతకినలేదు।వరునతోకలహించువారుచులేరు।అంగహీనులులేరరసి
చూడగను। అంగజులైపడినమఱియుండుదురు। నూరుపూండలకుమున్నగ
రూకవడ్డి। యేరుకిర్వదివాలుగెద్దులుదున్ను। పదిపాళ్ళకొకపాలుపార్థివే
ంద్రునకు। కొదవతొమ్మిదిపాళ్ళుకొనుపంటకాపు। యొలయుచుపుట్టికి నొక్క
రూకపన్ను। గలిగివర్తించునాకాలంబునందు। నిలనవగ్రహదోషమెన్నఁడు
లేదు।పలుమారుదున్నకపండుసస్యములు।గోవులుపితుకకగురియుచునుండు।
నేవేళధరామిపాలేరులుగలిన।కూర్మిసస్యంబులఁగూడిసహించు। ధర్మమునా
ల్గుపాదంబులనడుచు।హరిహరబ్రహ్మాదులద్భుతంబంద।ఇరువుగాయేబదియా
రుదేశములు।ధరణీశ్వరులచేతదగినకప్పములు। నిరవొందగైకొనినిలయేడుదీ
వు।లెరుకగాయకపురోహితులనాశ్రితులుపరమపావనులైనబ్రాహ్మణోత్త
ములు।మతిమంతులైనట్టిమంత్రిపుంగవులు। నతిభక్తితోగొల్వనావిష్ణుచక్ర।
మలయుచుపంపుసేయగనలాధిపుడు।చిరలీలరాజ్యంబుజేయుచునుండె। నంత
టనాదేశమందొకయెద్దు।వింతగానడవిలోవిహరింపుచుండు।కనుగొనియొక్క

❀ నిషధాపురంబునందలివ్యాఘ్రము యెద్దుపైశపథంబుబూనివచ్చుట ❀

వ్యాఘ్రముయోర్వలేక। మనమునకోపంబుమల్లడిగొనగ। పలికెనోహో
యంతభయమునులేక। వెలయనాయడవిలోవిహరించుచుట్లు। చెలరేగియె
నుగర్జించితి నేని।యిలమృగసంఘంబులెల్లభీతిల్లు। నీబాహుబలమెంతనీవా
రలెంత।నాబాహుబలిమికినరులెంతవారు।కలగినన్నింతగైకొనకీవు।వలరేడు
బలివైతెయుందులకేమి। ధారుణినలునిసత్యంబునగాదె। యీరీతిగర్వించితివిది
యెంతనాకు।నలరాజుసత్యమెన్నాళ్ళువర్ధిల్లు। నిలనెట్టిరాజేంద్రులైరోత్రొ
ల్లి। ఏలిపోయినవారలీనలుడెంత। గాలంబురాజ్యభోగమునవర్తించు। నేవి
ధంబుననైననేనిన్నుబట్టి।వావిరివాగోళ్ళవడిడొక్కజించి।గొబ్బునకుం — గో
రికిరక్తంబు। సుబ్బుచుమరిగ్రోలకున్ననేపులికి। పుట్టినవాడనేపుడమిలోపలను।
యనిముట్లుపులిబల్కనంతలోపలను। ఘనవ — భేంద్రుడుగర్జించిపలికె।

యివ్యాఘ్రమనీకునుచితమాయిట్లు । న్యాయంబు యన్యాయవాక్యంబు ।
పలికితినామదిభయమేమినాకు। ఇలలోననళోర్వీశురాజ్యంబు । సేయంగ
యిటువంటిసేతలునీకు।పాయకబలుకంగపంతమానాతో। నీయాననిటువంటి
నీతులుదప్పి। హా య్యేటి వేళకీబుద్ధిపుట్టించె। సకిలించెనోవిధి పాపంబుయనగ।
పులికుల్కపడ నేలనుర్విలోవిసుము। ఎలుకలుపిల్లులు యేనుగల్మరియు । వల
నొప్పుసింహములవైరంబులేక। ఇచ్చవచ్చినచోటనీవనంబునను।మచ్చరంబు
లులేకమహినివర్తించు।ననవినివ్యాఘ్రంబునంతగర్వించి। జననాథుసాక్షిగా
దిందునిన్నిపుడుఎన్నగానీసత్యమిప్పుడువచ్చినన్నే మిసేయునువనరంగననుచు
ఆగ్రహంబునలేచియావలింపుచును।శీఘ్రంబువృషభంబుసిద్ధించెమనకు। అని
తల్చిపైగాగనంతలోపలను।ఘనగిరులదరదిక్కరులెల్ల బెదర। సురలరుదంద
రక్షోతతిగుంద। నరులుజాతిల్లకిన్నరులుభీతిల్ల। దివిజులువెరగంది దివినుండి
చూడ।భువియెల్లగదలనంబుధులెల్లగలగ। పెనుపర్వుతోడగంభీరంబుతోడ
వినువీధిబరతెంచివిస్మయంబుగను। నరగునహావిష్ణుచక్రంబుపోల్కి। కరిగాచి
నక్రంబుఖండించినట్లు। తక్కకవ్యాఘ్రంబుతలద్రుంచివైచి । గ్రక్కునకమ
లాక్షుకడకునేతెంచె।నటుగాననారాజునతులసత్యమున।పటుగతిదోషముల్
పలుకంగనేగ।నతివేడ్క రాజసూయాశ్వమేధాది। క్రతువులుచేసియుకమలా
సనాది। దేవతులెల్లకిత్రింపశోభిల్లి। ఈవిధంబునజగంబేలుచునుండె। నంతట
కొన్నాళ్లకతిచిత్రముగను।సంతతకతినివసంతకాలంబు। చనుదెంచిమందార
జంబీరములను।పనసపిప్పలనింబపారిభద్రములుచందనపున్నాగసహకారము
లను।కుందకురంటకకోవిదారములు।లుంగలవంగమాలూరవృక్షములు। సం
గతిఖర్జూరచంపకంబులును।సురపొన్నలునుమంచుచాపోతములు।కురువక
న్బులుగేదగులునశోకములు।పుల్లమామిళ్లుకర్పూరభూజములు। నల్లసియర
టులునారికేళములు। నారదపాటలీనాగతింత్రిణులు। గోరంటలరటులుకుట
కుటభూరుహములు। లాదిగాగల్గినయారామభూమి। పాదుగానప్పుడేర్పరుపంగ
నాకు।రాలియొక్కటఁతిరమ్యమైయుండె। యాలోనచిగురించెనంతలోగాచె
పూచిఫలించెవుప్పొడిచల్లగాలి।వీచెనేలనుద్రావాలెవింతవింతగను। పలుమారు
పలుమారుపచ్చవిల్తుండు । అలరుపువ్వులతూపు లందంద నేయు । పవడంపు
చాయజొప్పడునాసికములను పవహేమమయమగునవ్యపత్రములు। విమలస
రంబులువిమలనేత్రములు। నముంగధవళమయంబగుచును ఎరుదుగాగను

గొనియవనీశ్వరుండు, సరసత జేయునసంతునిప్రాజ, కడు వేడ్కతో జూడగాన
చ్చెనసగ, నుతుతతవివినుండిమెల్లకన పుకు, వసుమతిపైనుండవచ్చెనోయనగ,
పొసగనంబరలక్ష్మిబూనుముత్యాల, హారంబుజారెనోయువనికిననగ, క్షీరాబ్ధి
తరలగ చెన్నువహించి, యాకాశమునసుండిహంసంబుపిండు, భూకాంతముం
దరబొదలుచుప్రాలె, ప్రాలినజూచిభూవరుడుహర్షాబ్ధి, దేలుచునపుడుము
త్రికిట్టులనియె, నెందుండివచ్చెనోయారాజహంస, లందంబుజూచిననతివేడ్క
బుట్టె, నొకహంసబట్టుకనూరకమనము, సకలంకగతినిముద్దాడుదమనుచు,

**నలమహారాజు రాజహంసంబును బట్టుకొనుట.**

నతివేడ్క లేచి యయ్యంచలకడకు, కుతలేశుడేగినగొబ్బునవెగసి, యవ్వాల
ప్రాలినవపుడుపోనీక, నెవ్విధంబునవైననేబట్టెదనుచు, కదసిమిక్కిలికుతుకం
బుల్లసిల్ల, పొదలినచురిపొంచిపొంచిపోవంగ, కనిపక్షులన్నియుకడుభీతినొం
చనరియొకమూనిపైచయ్యనప్రాలె, వానిసంగతిజూచినసుధీశ్వరుండు, వీని
బట్టగనెద్దిదారంకమనకు, తలగకతొలగకదనరెదునేర్పు, దొలగమానెక్కి
తొలునీవు, పసుపడనేనబ్టెపట్టెదనను చు, ననిననాసచివుంకునాభుజమెక్కియ
నురక్తిత్తులనదలి। పనివియువునమున బెదరుచుమహిమీదవాలె। ప్రాలినక
నుగొనివసుమతీశ్వరుండు । పాలించితనముంత్రిపతిమోముజూచి దిరిగివచ్చినీ
వొక్కదిక్కునసుండి। తగిలినవులుగలదటతోడబట్టు। మనపుడాభూమహా
యాతండుడిగ్గి। గొనకొనియొక్కదిక్కునసుండిడెండి। యనురక్తిపక్షులకడ్డమై
నిలువ, మనుజేశ్వరుడువానిమరిపోవనీక, నల్లనల్లనమహీనరుదెంచిపొంచి।
మెల్లనేయొకదానిమెడబట్టుకొనియె, కడు వేగమున లేచికడమరాయంచ,
డలుచునొకధరారుహంబుప్రాలె। చెలువనలరాజుచేజిక్కబడ్డ, పులుగు
లరాజుహంపుడిగిభీతిల్లి, పలుమారుదలపోసి భావంబులోన, గలుగుచుమే
మునిక్కడికినేతెంచి, లటుసుసనీసచేదగులంగగలిగె, కటకటాయాకృతిగాజేసి
నట్టి, బలువైననాప్రాతఫలము నేమందు, చలమునసురాజసంబునన్నృపతి, ప
మేమిసెయునోయెరుగంగరాదు, యేమైననేమింక నేమునవచ్చు, ననిహంసచిం
తచేనడలగానాత, డనురక్తితోరాజహంసనుజూచి, కనుగొందుమ్వోమక్కువ
ముద్దుబెట్టి। యొనరంగకన్నులనొత్తివాలించి। యక్కునజేర్చితియ్యనిమాట
లాడి। చెక్కిలినొక్కిమచ్చికజేయుచుండ। కనుగొనిసంతోషకరమగునట్టు
నుశేసుతోవచోమధురతబలికె। నవనిశధమంత్రియునిమొదుకాంత, సువిధ

(రాజహంసంబు నలరాజుతో దమయంతిని నీదు భార్యగావించెదనని చెప్పుట.)

జేసెద నీకు నో సగినన్ను విడువు। తగు నీకు దమయంతి దమయంతికీవు। తగుదువు
నామాట దబ్బర గాదు। సారసభవుడు నీ సౌందర్యమునకు। బోరన భువి దాని బు
ట్టించె మున్ను। నే గతినైన నా యింతిని జేరి భోగ దేవేంద్ర నీపాలతి జేసెదను। తలకొ
ని ఈ వేళ తగవట్టి మాటు। బలికి పోజూచేటి బకి విగాను। ఈపక్షి చేత వేగ మానట
న్ను। భూపాలచంద్ర నీబుద్ధి నెన్నకుము। నీ చక్కదనమును నీ విలాసమును ఆ చకో
రాక్షికి నమ్మ మరు భూపాల। నా మాట నిజముగా నమ్ముము మదిని। కామిని నీ సొం
ముగా జేయ నేర్తు। దమయంతి నీ చక్కదనము నిదలచి। సుమబాణ వేదన స్రుక్కి
యుండియును। నీ పాదపద్మముల్ నిరతంబు గొలువ। నా పద్మగంధి నీ సతివ జేసెద
ను। కమలాక్షు నాన నా కన్నులయాన। దమయంతి నీ యింతి తప్పదీ మాట। నావు
డు ముదమంది నరలోక నాథు। డా వేళ నాశ్చర్యమంది యాపక్షి। నతి వేగ విడచి నె
య్యమున నిట్లనియె। నతి వేడ్కతో నీవాడిన మాట। వినగ నా చెవులకు విందయ్యె
నేడు। నెనయ దా దమయంతి నేగతి నీవు। నెరుగుదు విలలోన నే రాజపుత్రి। తెరగొ
ప్పన వనిలో తిరిగెడు మీరు। రాజకన్యకల వర్తన మెరుంగుదురే। రాజహంసోత్త
మరమణీల లామ। నెలమి నా యింతి గా నెట్లు జేసెదవు। తెలియంగ సెప్పుమా తె
రగెల్ల మాకు। హంసరూపంబున నరుదెంచి మున్న, కంసారి జలజాక్షి కరుణించి
నట్లు, హంసరూపంబున నతి వేడ్క నాకు। హంసయానను గూర్ప నరుదెంచి
తివో। పాలును నీరును నేర్పరుపంగ నేర్చు। జాలి నపక్షి రాజవుగావె నీవు। మనుజ
భాషల రీతి మహిలోన పక్షు। లెనయంగ బలుకునె యెక్కడనైన। పక్షి విగావు
నా పాలి దేవతవు। ఈ క్షితిలోన నా యెలనాగ జనన। మంతయు నెరిగింపుమనవు

## దమయంతి జన్మవృత్తాంతము.

డు పక్షి। వింతగా నారాజవిభున కిట్లనియె। ధరణీశ వినుము విదర్భ పురంబు। కరమ
ర్ధి జగతి ప్రఖ్యాతమై యుండు। నా పురాధీశ్వరు డమలమానసుడు। భూపాలచంద్రు
డు పుణ్యావర్తనుడు। భీమభూపాలుడభేద్యుడు త్తముడు। శ్రీమించ రాజ్యంబు సే
యుచునుండె। ధరణీశ్వరునకు సంతానంబు లేక। ధరణీసురార్చన లప్పుర జేసి। తప
ములు జపములు తగిన దానములు। నుపవాసములు పెక్కులొనరించి యలసి। క
డలేని దుఃఖసాగరమువ మునిగి। పుడమీశుడాస్థానమునకు నేతెంచి। యురుదైన
రత్నసింహాసనోపరిని। ఇరువంక గూర్చుండి హిత పురోహితుల। గాయక వంది
మాగధ మంత్రివరుల। నాయత మతి జూచి యప్పుడిట్లనియె। వినుడు సన్నాహమవి

శమునగలుగు, సనిభూసురావళినఖిలదానముల, నొనరించితినిమరియుచిత
మార్గమున, తనయెందులనుసంతతి లేకపోయె, నిరవైనసంతానహీనుడైనట్టి
నరునకుదూరమౌనాకేశపదవి, సుతులనుబడసినచూచియందంద, పితృదేవ
తలనుసంప్రీతినొందెదను, వసుధయీతనూవులెవ్వారునమ్మినారు, పొసగినయీ
రాజ్యభోగంబులేల, మనమారతనయులమధురవాక్యముల, వినగనేర్చనియ
ట్టివిమలాత్మునకును, వీణామృదంగాదివిస్వరములు, వేణునాదములైనవిననిం
పుగావు, విడువకిప్పుడుమునివేషంబుదాల్చి, తడయకనిపుడుసంతానార్థియగు
చు, తరుణితోగూడుకతపమునకరిగి, పరగంగపుత్రులబడసివచ్చెదను, మంత్రి

భీమభూపాలుడు సంతానార్థియై తపంబునకరుగుట.

కోవిదులారమహిమనరాజ్య, తంత్రంబునడుపుడు తగనేనువచ్చు, నందాక
యనిబల్కియపుడుభూసురుల, నందరరావించియతిభక్తిమ్రొక్కి, భటపరి
చారికప్రకరంబులకును, తటుకునతనదువృత్తాంతంబు జెప్పి, పుడమికాపులకు
నేర్పడబుద్ధిజెప్పి, పడతియుదానునుపరమహర్షమున, చెలువుమీరగనార
చీరలుగట్టి, తెలివిభూతమైనిండతిరముగానలది, కురులెల్లజడలుగాకూడంగ
జేసి, పురమువారెల్లగుంపులుగట్టిచూచి, యారాయనంగ ఘోరారణ్యము
నకు, ధారుణిభర్తమోదంబుననరిగె, ఫలములుదళములుభక్షించికొండ చి
లములవిలసిల్లి భీతిల్లియిట్లు, కొన్నిదినంబులుఘోరాటవులను, క్రన్ననవిహ
రించగానొక్కనాడు, తనశిష్యులునుదానుదమనమునీంద్రు, డచురక్తిమీర
గానవాటికివచ్చె, వచ్చినమునిగాంచివసుమతినాథు, డచ్చుగాసాష్టాంగమొప్ప
దర్పించి, పలుమారుమునినాథుప్రస్తుతిశేయ. తలపునమెచ్చియాతపసియి
ట్లనియె, నెక్కడవిహరింతు కెప్పుడుమింము, నిక్కాననంబుననెన్నడుగాన, త
లపోసిచూచినతాపసవృత్తి, గలిగయున్నది రాజకళలు మీయందు, నమరి
యున్నవిమీరడవిలోనిట్లు, క్రమమునవిహరింపగానేలమీర, లెవ్వారోయనిన
భూమీశుడాతపసి, ఇత్థంబంతయునటచెప్పదొణగె, తాపసవర్యవిదర్భపు
రంబు, నేపారమీడయనేలెడువాడ, నీపద్మగంధినాయింతి[illegible], నా
పేరుధరభీమనరనాథుడండ్రు, పరగసంతానసంపదలేకనాకు, ధరణిపాలింపంగ
తగదటుగాన, లవసివేషముదాల్చితరుణితోగూడ, తపముసేయగమదిదలచు

దమనమునీంద్రుడు భీమభూపాలుకై తపంబొనర్చుట.

వచ్చితిమి, నావుడువినిమునినాథుడాభీమ, నావల్లభునిజూచిపొలుపొందబలి

క, భూమీశ మావనంబునకు నేతెమ్ము, తామసింపగ నేను తపముగావించి, వనజాసనాది దేవతల చేవరము, గొనివచ్చి యిచ్చెద కొదువ లేకుండ, ధరణీశ యంత సంతానంబు వడసి, యిరవొంద పురమున కేగుదుగాక, ననిదోడుకొనుచు నిజాశ్రమభూమి, కనురక్తి చనుదెంచి యతిఘోరతపము, గావించగా మెచ్చి కంజాతగర్భుఁ డావేళ తనకు ప్రత్యక్షమై నిలువ, మునికులచంద్రుండు ముదమంది బ్రహ్మగని సన్నుతులు జేయ కమలజుఁడనియె, నిదియేమి మునినాథ యింతగా నీవు, పదవడి ఘోరతపంబు గావించి, నేమి కార్యము వచ్చె నెరిగింపుమనిన, భీమనాముండ న ప్రియశిష్యుఁ డొకఁడు, లోకేశ కలఁడు భూలోక నాయకుఁడు, ప్రాకటంబయి సంపద లెల్ల బుసి, సంతతి లేని విచారంబుతోడ, నింతియు దానును మాయొడ కేగుదెంచె, సతని కె సంతానసమృద్ధితో నిచ్చి, యతివేడ్క రక్షింపు మనవుడు బ్రహ్మ

బ్రహ్మ భీమభూపాలునకై దమనునికి వరంబిచ్చుట.

పాలుపుమీరగ నొక్క పుత్రి పుత్రుండు, గలఁడంచు జెప్పి వేగంబున వరిగె, నంతట దమనమహామునీశ్వరుండు, వింతగా భీమభూవిభుని వీక్షించి, కుతలేంద్ర నీకొక్క కూతురు కొడుకు, నతివేడ్క గల్గుదు రరుగుము పురికి, ననవుడు సంతసమంది యారాజు, మునినాథునకు రేఁడు మ్రొక్కి యిట్లనియె, దమనమునీంద్ర నీదయచే తనాకు, క్రమమున సంతతి కలిమియు గలిగె, నవి సన్నుతులు జేసి యవనీశ్వరుండు, తనసతితోఁ గూడి తనపురి కరిగి యేలుచున్నాఁ డదనంతరమున, పరువడి యా రాజపత్ని గర్భంబు, ధరియించి ముందర తనయుని గాంచె, తిరగొప్ప మరికొన్ని

దమయంతి జనించుట.

దినముల వెనుక, తనయను గాంచె నాతరళాయతాక్షి, జననాథచంద్రుండు సంతోషమంది, దమనాఖ్యుఁడను పేరు తనయునికొసగి, దమయంతి యను పేరు తనయకు నొసగి, కొడుకు కన్నను ముద్దుకూతురు మీఁద, పుడమీశుఁ డతివేడ్క పాలు పొందుచుండె, క్షీరాబ్ధికన్నియ చెలువొందినట్లు, మీఱి భూధరపుత్రి మెలగుచున్నట్లు, తరుణి వర్తించె సౌందర్యసంపదను, ధరణీశ యబ్బంగి దమయంతి పుట్టి నెరుగుదుమున్న నే నేగతినైన, యిరువంద దానినీ యింతి జేసెదను, మానవాధీశ యీమాగు వనీసామ్ము, నేనాడుమాటలు నిజమని నము.. మని యంత బలికిన నంతయారాజు, వినిమనంబున చాల విస్మయంబంది, బలువిడి నానందబాష్పము ల్చాల, పలుమారు దొరుగ నప్పుడు వల్లభుని, చేకొని కౌగిట చేర్చి ముద్దాడి ఘూర్ణాలితుడప్పుడా పాలవిదగ్గరకు నతివేగపోయి రమ్మని నీనుకొలప, శతపత్రముల

వలువుహంసలను, రయమున నాహంసరాజు కూడుకొని, పైనమైయాత్రోవ
పైవంబు నిలువు। నేయక నలునికా చెలిగూర్చుతలపు, దోయక భూమికాంతు
నిమీఁదిభక్తి బాయక నాకటబడి తమ్మితూండ్లు, మేయక నీడల మెలగంగలేక,

## దమయంతివనవిహారం బొనర్చుట.

భూవలయంబు పాలుపొందునట్టి, యావిదర్భపురికి నరుగుచుండ, నచ్చట
దమయంతి యతివలు దాను, విచ్చలవిడి వనవీధికి వచ్చి, కలయంగ శుకశారిక
లుమయూరములు, బలుకుచుండగ వానిపలుకులు వినుచు, పూచికాచినమం
చిపుష్పవృక్షములు, జూచి యింతులకును జూపి నవ్వుచును, యలరు దేనియ
లందిగ్రోలుచును, యలరుపూచినగురుల నరసి నవ్వుచును, చల్లనగాలికి సంతో
షపడుచు, పల్లవంబుల నెల్ల పరికించిగోనెడు, చెలులలోనమితారికలికికటారి,
చెలువులవంకి వాసలపూలచెంకి, చెలియలమేల్బంతి చిత్తజుబంతి, వలపుల
బొంతి సేవంతిపూబంతి, మరునిపట్టపుచిలుక మరువంపు మొలక, అరుదువు
ప్పొడిదిన్నె అమృతంపుగిన్నె, కంమతావుల టావు కళలకు నెలకు, కంమతేనియ
బావికపురంబుగ్రోలి, సొగసువజ్రపుతళ్కు సొబగులబెళ్కు పగడంపులతకూన
పన్నీటిసోన చిలుకలకొల్కి యాచిగురాకుములికి, కులుకుముద్దులగుమ్మ గో
జంగిరెమ్మ, యనిచాలకొనియాడనన్నిటదగిన, వనజాక్షి శృంగారవనము కా
పలను, కదిసి కెంపులబురవల కాంతులజిమ్ము, నుదుటబంగరుసొమ్ము జడలం
దుమెరయ, జలజలోచనలగుసఖులును గొలువ, నలరుచు దమయంతి యతివే
డ్కమేను, తెలియనివలవినోదింపుచుండ, కలహంసలపుడు వేగంబున వచ్చి,
రమణులతోడనంభ్రమకేళినుండు, దమయంతి యెదుట నందముమీర వ్రాలె,
నెలత చేనడుపులు నేర్చుకోదలచి, కలహంసలీరీతి కదిసెనో యనగ, వ్రాలిన
యంచలవల నొప్పజూచి, మేలని దమయంతి మెలతలు దాను, నప్పుడు గనుగొని
యాశ్చర్యమంది, యొప్పులకుప్పలై యొప్పిచలంగు, నారాజహంసల నవుడు
బోనిక, బోరునతరుముక బోయియందంద, పొలతులందరు పొంచిపొంచి పోనీక,
చలమున నన్నియంచల బట్టిరంత, యా రాజనందన యా రాజరాజు గోరిపట్టిన
యంతగొబ్బున బట్టి, యక్కున దిగియించి యపుదల నిమిరి, చెక్కిలినొక్కి మ
చ్చికమూర్ధ బెట్టి మెల్లన దువ్వుచు మృదులోక్తులాడ యల్లగనుగొని యా

## దమయంతితో రాజహంసంబు నలుని పురుషునిగావించెదనని చెప్పుట.

యంచపలికె మానవభాషల మధురమైయలర మానిని నీకొక్కమాట చెప్పె

దను।విడువుముననునీకు వేగముగలుగు।పడతినీరూపునంపదజూచినాడు। కడు వేడ్క-బుట్టెనిక్క-ముగనామదికి। నుడుగకవినుమునీకొకటిజెప్పెదను। రంగై ననిషధపురంబేలు రాజు।శృంగారవంతుడూర్జితసత్యధనుడు।నరలోకనుతకీర్తి-నలచక్రవర్తి। కరమొప్పవిష్ణుచక్రముపంపుజేసి। యిలనేడుదీవుల నేలడు రాజు।నలకూబరునికన్న నవిల్తుకన్న। సరసిజభవుకన్న జలజాప్తుకన్న। హరుకన్న బలదైత్యహరుకన్న మించి।ధరణీచెన్నొందునుతరళాక్షీనీకు। సరియైనవాడమ్మ సౌందర్యరేఖ। రమణినేజూడనిరాజులు లేరు। రమణిరోయటువంటిరాజునుగాన। కలకంఠనీవంటికామినీమణికి। వెలయుంగనలరాజు విభుడుగావలెను।నాకుజూడంగనోనలినాయతాక్షి। చేకొనుమనలునినీచెలువుడుగాగనలుని కన్నమంచినాథుండు లేడు, నలువలరంగపదునాల్గులోకముల। వనితదబ్బరలాడు వారముగాను।కనివచ్చితిటకునాకన్నులయాన। వానికిదగునీవువర్ణింపనేల। మానినినీరూపమహిమకుదగిన। వాడుగావుననిట్లువర్ణింపవలసె। నేడునీదగ్గిర నెలతరోవాని।పొసగినబంగారుబొమ్మనిదెచ్చి।మసిపాతగట్టుటమాకుసంమతమె। ధరలోననోములుతగినదానములు। చిరభక్తిపూజలు నేతురుమంచి। పతులుగావలెనంచుభామినీమణులు। అతివరోనీదుభాగ్యంబున కేమికొదువెనీనాథుడీకువలయాధీశు।డదిగాకవినవమ్మయువనిలోపలను।నలరాజుచక్క-నివాడంద్రుజనులు।చెలియాయనంగుభించినవాడునలుడు। కలికిమారుడునీటుకాడనుకుంటినే। తలపులోపలవానిదలచిచూచినను। దురితకర్ముడుశివద్రోహిదుర్జనుడు। హరికుమారుడుగాననతనికిచెల్లు। నదిగాక వినవమ్మ యామహీశ్వరుడు। పదపడిహరిహరబ్రహ్మాదిసురలు। దీవింపనిల యేడుదీవుల నేలు।కావునవానిచక్క-దనంబుదెలుప। నాపలకరుమాయోన్నికైనశక్యంబె। యోపద్మనయననీకొప్పనాథునుడు। పతిగోరియతివరూపమున జన్మించు, నతివానిబొందనిజన్మమేమిటికి। ఆరాజవరునికిల్లాలవైతేని। యోరాజివదనీయునికిదగునె యలివేణియోగతినైననునలుని।వెలయంగనీప్రాణవిభునిగాజేతు। ననియివ్విధంబుననానలాధిపుని। వెనుకొన్నభక్తితోవేవేలగతులు, దలపోసివర్ణింపదమయంతియంతి। పలుకులకానందపరవశయగుచు-కన్నులబాష్పంబుకణములుజ్వాడమి, చన్నుగుబ్బలమీదజలజలధారుగ, తనమేనుపులకించితలయూచిమెంచి, యనురక్తిపిడచినెయ్యమునకిట్లనిమె, రాయంచ రాజయా రాజ దేవేంద్రు - డేమడ నుండునీ వెల్లెరుంగుదువు।

పులుగుల రాజవు భూపాలు డతఁడు, తలపోయనీకు నాతని చుట్టరికమే గతిగలిగెనాకింతయు దెలియ. వేగంబె జెప్పుమా వీనులు దనియ, ననవుడు రా

— రాజహంసంబు తనకు నలునికి సఖ్యంబైన విధంబు జెప్పుట. —

యంచయాయంచగమనగనుగొనిసంతోషకలితమైబలికె। వినవమ్మ చెప్పెదవిశదంబుగాను। జనలోకనుతుడుసజ్జనలోకహితుడు। భానువంశంబున బలుడైనవీర।సేనునకుదయించి చిరకీర్తి వెలయ।రమణతో నిషధపురంబుననుండి।కమలాయతాక్షుచక్రముపంపుసేయ। యెనయదీవుల నేడు నేలుచునుండి।మనుజేశుడొకనాడుమంత్రులుదాను। వరుసతోశృంగారవనములోపలను। చరియింపుచుండ నాసఖులును నేను। భూరామిశుదగ్గిర బోయ వ్రాలితిమి। యామీదమముజూచియాచక్రవర్తి।కరుణారసముజిందగానన్నుబట్టె। కర మొప్పలాలింపగానామహీశు। చక్కదనంబునుజవ్వనంబతిని। మక్కువనుగుణసంపత్తిభాగ్యమును। చూచినామనసునశుభము రెట్టింప। యీచక్కదనమునకిల్లాలువలయు। ననుచునీరాజునకనుకూలమైన। వనితదెచ్చెదననుచువసుధపైనొప్పు। తరుణీమణులచక్కదనమెల్లచూచి। సరిపోవకిచటికిచను దెంచునీదు।వరరూపవిభవలావణ్యసంపదలు।పరవిజరాడగమాకుసంతోషమయ్యె।నదిగాననలునివృత్తాంతంబు నెల్ల। విదితంబుగానీకువివరించితిపుడు। నెలత మెటున్నదో నీచిత్తవృత్తి। తెలియగరాదమ్మ దేవసన్నిభుని।నలునింరించిమన్ననగాంచితేని। నలరునతావియునలరనట్లుండ। నరలోకమందు నరనాథునంటి నరనాయకుడు లేడునరనాథపుత్రి, కల్లలుబలుకనాకన్నులయాన, పల్లవపాణినీపాదంబులాన, సత్యంబునామాటసత్యంబుసుమ్ము, సత్యమేజయమనిసకలయత్నముల, పలుకుదురిలలోనపావనమతులు, తలపోసిచూడమోతరళాయతాక్షి, యనవుడుమదిరాక్షి యాపక్షిరాజు, గనివిస్మయానందకలితయై పలికె, నోపక్షిరాజేంద్ర మోదయాసాంద్ర, నాపాలిశ్రీరామ నాథుండవీ

దమయంతి నలుని దనకు పురుషునిగావింపుమని వేడుకొనుట.

వు, రక్షింపగదలంచి రయముదవచ్చి, యాక్షితీశ్వరునినమ్మగువనా, పుని, నలరాజచంద్రుని నాథుగాగ, చెలువందజేసిరక్షింపవేన ఇరవొందనీ మాటనేజవదాట, నుదారనారూపమాతయురాజ, వరునిలోపలమూరు వర్ణించిచెప్పి,సరవినీవిచటికిజనుదెమ్ము గామ్ము, చెలగినీవింతగాజెప్పుచున్నగను తలపోసియేనువింతకునోడంబడితి,నికనో మాటనీకెరిగింతువినుము

టితగతినేనుప్రతిభనొవర్చి। నలునకుమనువొండెనలుడొల్లననిన । వెలయుని ప్రాణంబువిడుచుటయుండె! ఘనతరబుద్ధిత్రికరణంబుగాను । పనిబూనివలికి తిపణతినామాట। పూనికతోనన్యభూములనేలు, మానవాధిపుగూడిమను దానుగానె ఇంతేసిపనులకునెడముగానీక, కంతునిశరములగాసిల్లనీక , కుసుమాస్త్రకేళికిగుందంగనీక, వసుమతీపతికినావర్తమానంబు , తేటలెల్లంబుగాదెలియంగపలికి , మాటలురీతిగామరికొన్నిజెప్పి , ఏవిధినైననాయిన కులాధిశుని, వేవేగనాప్రాణవిభునిగాజేయు , మన్నిప్రియవాక్యంబులంతంత బలుకు! వనితనుజలాచియవ్వాలపక్షిబలికె , కలకంఠినీవింతబల్కంగనేల , తలపనికార్యమంతయునాదిగాదె, వలనొప్పనలచక్రవర్తికిదగిన, కతికినెన్నడుజరాడగలుగునోయనుచు, తలపుమనుందునోతరళాయతాక్షి , పలుమారునినుజూడభాగ్యంబుగలిగెనటుగానపలుమారునడలనేమిటికి, తటుకుననలునినీధవునిచేసెదను, యొద్దికమీకార్యమొనగూర్చెదనుక, నిద్దురమేడదేనెలతరోనాకు, వనితమేమటువంటివారముగాము, మనమునగుందకు మనుజేశుగూర్తునని చెప్పితనవారినందందవిడువు, మనినీవువిరహాగ్ని నడలంగవలదు చనుదెంతుమరలనిచ్చటికంచుదెలిపి,వినువీథివరిగెనావిహగేంద్రుడచట , ధరణీశ్వరుగుబీమతనయునిదలచి , నలరువిల్తునిజుంపవేదనకులికి, విరహాగ్ని

నలుడువిరహాగ్నినింగుందుట.

చేగుందివేనటనొంది, సురపొన్నవీడభాసురముగానొక్క-చలువపూపందలి పరగవేయించి, పొలుపందపచ్చకర్పూరంబుదన్ని. పరిపించిదానిపైపన్నీరు జల్లి, పరవుగాచిగురాకుబాన్పుగావించి, కొత్తకస్తూరింపుగగూర్చినమంచి మెత్తనిగంధంబుచెయినిండబూసి, తావిపన్నీటనుతడవినపచ్చ- నేవంపిపూరుల్చెచ్చెరబూనిమరుపేథకోర్వకమరిమరికరిగి, పరతెంచయూపాన్పుపైనవవళించి,తనువెల్లభాగులచింతావార్ధిమునిగితనలోననిట్లనితలపోయదొడగెలంచలుబొంబనయుంతనుండియును, పంచబాణుడునాకుపగవాడునయ్యె, నేమిసేయుదునింకనిటమీదనాకు, కామాక్షికడకరనెవారిబంపువాడ,జడజారిభ్రామయింపజాలినముద్దునలినాక్షిప్రుణముననె డుజరాడగల్గునదుగరంగతేనియనొలుకంగబలుకు,పణతిరోనెన్నకుభాషింపగ్గసలివేణితియ్యనియధరామృతంబు, నలతదీరగనెన్నడానానంద, గ్గొ మధుమొప్పమదిలోనముచ్చటదీర ముదితఎన్నడునాకుముద్దిడగ ౘలరనాచేతులయానలుదీర-పొలతిపా

లిండ్ల నెప్పుడుపట్టపగలు।కవగూడిరతి కేళికాంతులుప్పొంగ। నువిద కౌగిట నెన్న డుండంగగలుగు।శ్రీనాథ యనియిట్లుతలతిని నాయకుండు।మానక నడలికంమర దంచదలచి।బోరలుచు నెక్కడబోవనోయంచు। సరసులన్నానవాబ్జంబులుగాంచి।మరిగియుంతటనన్ను మదిలోనమరచి।యొరసిభక్షింపుచున్నదోయంచు। యనరంగ తామేగునట్టిత్రోవలను। తమవారిగనినన్ను తలచదోయంచు। త్రొయ్యాలితో నేర్పుగొడభాషించి।ఒయ్యానవచ్చుచుయున్న చోయంచు। తరమిడి నామీదదయ నేగుచుండి।పగువడిఅడవిలోబడలెనో యంచు। ఏమియు తెలియ రాదిందాకవత్తి।యేమిరాయిచటికి నేలరాకుండ। నమమెచ్చనూర్పుచుహా రమానాథ।యతనితలచుచునుండ నప్పుడాయంచ। చనుదెంచిసఖులతోచయ్యానవాలిలి ఘనభక్తినలరాజుగనుగొనిపలికె। సమరనీయానతినిచ్చోటికేగి, దమయంతిగనుగొనితరలివచ్చితిమి దానిచక్కదనంబు తలపనచ్చెరువు,

రాజహంసంబు దమయంతినివర్ణించుట,

భూనాథవిన్నము నేర్పునవిన్నవింతు। మెరుగునీలవుసరుల్మించినకురులు, పరిపూర్ణకళసోముబడసించుమోము, తిలపుష్పములచెక్కుడెగడెడుముక్కు నలినాక్షికలుహాయియల్లవ్యాకర్ణములు, హారిణంబులజయించుపత్తులవంచు। మెరుగుటద్దముబోలుమించుచెక్కిళ్లు, యలరుబింబమునేవి నడగించుమోవి, చెలువుశ్రీకరములు చెలియుకర్ణములు, ఘనమైనశంఖంబు గవయుకంఠంబు, కనకంబుతీగెలగడపుబాహువులు, మృపల్లవంబులు మిగులుహస్తములు, కుదురుకల్వాలమీరుగోకులతీరు, వలుదబంగ్గారు చెండ్లువనితపాలిండ్లు, చెలువైననీలంబుచికిలిరజంపు, నురువడితోబోరునువిదనూగారు_ధరపొన్న పూబోణితమునుమీనాభి,వసుధసింగముతోనువాదించగాను, నిసుకదిబ్బలహొందు నెసగుపిరుందు। లరటిగంబంబులనడగించుతొడలు, మరునినిషంగనామ్యంబుజంఘికలు, కెందంమి రేకులగేరుపాదములు,నందంబుతావెళ్ళనడరుమీగాళ్లు, వనితకునదియెల్లవర్ణనగాదు, మనుజేశనేగొంతమాత్రమెంచితిని, నీరాజతేజంబునీప్రతాపంబు, నీరూపవిభవంబునీపేరునంబు, నాపురిరాత్రికినామదవతికి, నామోహనాంగికి నాసఖీమణికి, నాపద్మగంధికి నాపుణ్యవతికి, నాపువ్వుబోణికినాగుణవతికి, నాదమయంతికినంపంగమెన్ని, మోదించిమదిలోనముచ్చటదీర,వరుసవేవిధములవర్ణింపచెప్పి,తరునికినీమీదతలపుబు[illegible]చి, చెలియనిసామ్ముగా జేసివచ్చితిని, చెలిమిరాజేంద్రనీకిక

తవలదు, నీకుఁగాన దేవకన్యనీరజయోన, యాకంజలోచన నవని బుట్టించె, నింత యునిజమని డెందంబున బోధ, సంతోషము లలర రాజ్యము చేయుమనుచు, బలికి హంసము విదర్భకు పోవ్వెదరని, తలపున నప్పుడా దమయంతి కన్య, పలుమారు

## దమయంతి విరహాగ్నిని జెందుట.

నలమహీపాలుని దలచి, యలరుమిల్లుని పువ్వుటమ్ములకు లికి, ఘనమైన మోహాసాగరమున మునిగి, తన ప్రాణసఖులను తప్పక చూచి, రాయించ లేక కోరా దడవాయె, నాయువనీశు డేమని యెనో గాక, హాయక తమ జాతిపక్షుల గూడి, పోయెనో కొలను లబ్బా నైనో లేక, యుపవనంబున లోనున్న దోయించ, చపలాక్షి యిట్లు విచారంబునొంద, నిదిమంచి సమయమని మాయంతిని వేళ, గదశి నాపగ దీర్ఘకడు వడి నమచు, తమ్మి తూపాకి కెందలిరాకు దంతి, కమ్మని విల్లు చెంగల్వ నేజయును, జాజిపూబాకు గొజ్జగి పెద్దగత్తి, రాజిల్లు చిలుకల రథము పై నెక్కి, యలరుతుమ్మెదల సైన్యము మున్నె నడువ, పలుమారు పంతములు పలుకు కోవెలలు, పరవు మీర చకోరబలములు గొలువ, మరుడుదండెత్తి యా మానిని మీద, చలమున చను దెంచి నరగున గవసి, యలరు వింటను పువ్వుటంబు లెక్కించి, కరమున దెగ దీసి కలికి పాలిండ్లు, గురి జేసి నేడి నేసి కోయని యార్వ, నప్పుడా పూబోడియంతరంగమున, నుప్పిరిగొను తాపమున కోర్వలేక, ధృతి దూలి మిగుల గుందెడి తరియించ, యతి రయంబున వచ్చి యాతివ కిట్లనియె, పూరాజవదనయా యుర్వీశు కడకు, భోరున పోయి నేర్పున నీగుణంబు, భాన రూపంబు భక్తియు ప్రియము, వాపిరి వర్ణించి వర్ణించి వాసి, మనమున దయబుట్ట మాటలు జెప్పి, వనితనీపై మేలువాని గావించి, పచ్చితి నేవిటక వరియింపు మతని, మచ్చిక సకల సామ్రాజ్యవైభవము, ననుభవింపుము సుందరమతి నేడ్కతోడ, వనితమేమిక పోయి వచ్చెద మమ్మ, మరువక దయనుంచుమా మీద ననుచు, బలువడి పలికి యా పక్షులు చనియె, నంత నక్కడ నలుండతివను దలచి, కాంతు నిశరములగా సిల్లి యునికి: యాహారము డిగి నిద్రాపేక్ష మాని, యామారి బోడుచు హాహారి యనుచు, తనలోన దమయంతి దమయంతి యంతి, యనుచు బల్కుచు వెరగందిచూచుచును, మంత్రులు జూడక మహాసీయ రాజ్య, తంత్రంబు నడపక దనరెడు కొల్వు, కూటంబు సమరాక కూర్మి జెన్నొందు, హాటక రత్న సింహాసనోరని, కూర్మి గూర్చుండక కొలువు వారలకు, బేర్మి సంబళము లిప్పింపక జనుల, మనవులు వినక బ్రాహ్మణుల కు ధర్మ, మొనరింపక నమంగులాసగుచున్న,

కపురంపువిడియంబు జేకొనక వేటకై నరుగు, వెడలసంగీతవీణామృదంగ, నినద
ముల్వినకచిన్నెలలేకరాడు, ఘనమగు నాట్యసంగతిజూడ కాత్మ, దమయం
యంతులసౌందర్యంబుదలచి, సముచితగతినాప్తజనులతో మెచ్చు, టాడకతా
నేర్చునట్టిపదంబు, బాడకవిరహతాపంబుననలుడు, తనయొక్క యేడుగాదీ
తనొంది, యొనరవర్తింపుచునుండనవ్వేళ, సచివోత్తముడుమానసమునచిం
తించి, యుచితవాక్యములవిభునూరార్చిపలికె, నలధారుణీతలనాథనీవిపుడు,
లపునదమయంతిదమయంతి యనుచు, పలుమారువిరహతాపమునగుందినను
నలరేగిభూజనుల్ నవ్వరేనిన్ను, నరనాథసామాన్యనరునికై వడిని రాత్రి
పలుమారుదలచంగదగునె, వినుమునీవంటిభూవిభునకునిట్లు, వనితకై [illegible]రం
న్బువదలింపదగునె, మదిలోనబుద్ధిమరచియీరీతి, వసుధకై పలుమారుశోకిం
పదగునె, ఇదియెంతకార్యమేనిప్పుడిచ్చోటు, కదలిభీమనృపాలుకడకేగియని
న, నడిగియాదమయంతినమకూలపరచి, కడువేగవచ్చెదకలగకుమింక, మచ్చి
కతోసభామంటపంబునకు, విచ్చేయుమని వేడివిభుని దోడ్కొనుచు, సాతప

## దమయంతి మదనతాపంబు జెందుట.

బలరనాస్థానంబు జేరె, నంతనక్కడరాజహంసలుజనిన, నంతనుండియునుభీ
మావనీశ్వరుని, సంతతిపుత్రిభూరాజనుతగాత్రి, దమయంతిమదనవేదనజెంద
కుంది, శమియింపనేరక సంతాపమంది, నలరాజచంద్రుని నరలోకవిభుని
పలుమారు పలుమారు భావంబులోన, తలపోసి తలపోసి దలయూగి
మేను, పులకించి పులకించి పూనిమోదించి, తిలకించి తిలకించి తెలియ
వర్ణించి, చెలరేగి చెలరేగి చెలియవేనోళ్ళ, వినుతించివినుతించి వెలదుల
జూచి, వనజాక్షులార నావల్లభుడిటకు, రాడకోమీరై నరయమునబోయి,
వేడుకోరాదె నావిధమెల్ల చెప్పి, తోడుకరారాదె దోసమామీకు, వేడుకగా
దె నావిభుడును నేను, జోడుబాయకనుండిసురతసౌఖ్యముల, కూడియుండగ
కనుగొనరేమొమీరు, కటకటానేనింతగాసిజెందంగ, నెటులజూచెదరుమీ
రెంతనిర్దయులె, పసిబాలనిటుజేయపాటిగాదంచు, కుసుమబాణుని వేడుకొన
రమ్మమీరు, తల్లులకు జెప్పరే యలివేణులార, నెలతనీగతి జేయనీతిగాదంచు, న
లనొప్పజెప్పరెవడికో వెలలకు, కలకంఠనిట్లేచగారాదటంచు - పణతినీగతిజే
యపాడియేయనుచు। నడిచకోరా ప్రుస్తనివారించరమ్మ। కలికినీవై ఖరివారించక
నుచు। లోలుతవసంతునితో జెప్పరమ్మ। యనిపల్కి హానాథయనిమూర్ఛబో

యి। మనమున దెలిసిమన్మథుడు నామీఁద। నిటుసేయుదనకు నేనేమి చేసితిని। కట
కటాయని లేచుకన్నీరునించు। చలిగాలివిసరినచాలకునలరులు రాలినయందం
ద వెరచు। కడు వేగ లేచియా కామినీమణుల।తొడలపైపవళించు దుఃఖంబు బెం
చు। పతి రాకయిపుడు నా ప్రాణంబులుండ। వతి వెలా రాయనియుపనిమూర్ఛిల్లి
యొకకొంత ప్రొద్దునకొయ్యన తెలిసి।యొక చోటుగోరి వేరొక చోట జేరు। నొక
చెలి పేర వేరొక చెలిబిలుచు।నొకపనికనుచు వేరొకపనిదలచు। నొకమాటలా
డి వేరొక మాటలాడు।నొక చెలిబట్టు వేరొక చెలిదిట్టు।నొకపట విరగందునొకప
రిగుందు। చెలులనుజూచి యోహో చెలులార చెరుగు। విలుకాఁడదిగో నన్ను వేయు
చున్నాఁడు।మీరలందరుగూడి మెల్ల నేపొంచి। పారిపోవగనికపట్టిగట్టిగను।విర
చికట్టుకరండు వేగ మెపొందు వెరచినవారల వెరపింతురర్వినను మాటనిజమా
యెనలునునివలన।ననయిట్లుభ్రమమాటలాడంగ చెలులు। వెరగందిదిగులొం
ది వేదనబొంది।మరునిదూషించి క్రమ్మర వివేకించి। మరునన నేలతామరతూం
డ్లమెసగి।చనుదెంచి కాంచిరాహంసలీరీతి। నలుడునలుండనినయముగా జెప్పి।
సొలతినీగతి జేసిపోయియుండంగ। నేమి సేయుదమింక నిటమీఁదమగువ। కేమి
మానునోయీమరుతాప। మనిచాలచింతించి యులివేణిగాంచి। గొనకొని
గ్రిరమూర్ఛుండపలికె। కన్నులనిండారగారెడునీరు। మన్ననదుడిచి యీమది
రాక్షిగుబ్బ। చన్నులపైకొంగుచక్కగావైచి। వెన్నునకందందవిరసి చిక్క
యిన। నెరికురుల్ కొప్పుగానిగుడించితొడల। ముదువు నదిమి ముద్దుమోమున
మోచి। కదియించిలాలించి కౌఁగిటనునిచి। ఇది యేమి నెలత నీకిటువలెనలత।
ఇది యేమి చెలియ నీకిటువలె సొలయు। నిది యేమిలలన నీకిటువలె చలన।
మిది యేమిమగువనీకిటువలెవగవ। నిది యేమి తెరగునీకిటువలెమరుగు।నిది యే
మివింతనీకిటువలెచింత ఇది యేమియువిదనీకిటువలెబడలనిది యేమివింతనీకిటు
...లెచింత। ఇది యేమికోలకనీకిటువలె వెలయు।ఇది యేమిభామనీకిటువలె ప్రేమ
...యేమికొమ్మనీకిటువలెనమ... ఇది యేమితరలాక్షి యింపేమదికి। ఇది యే
మమతనీకిటువలె ములయ। ఇది ... మిద నాక్షి ... ంత బాలార్ప ఇది యే
...యింతినీకింతవిభ్రాంతి। వెరవకుమావంటి వెలదులుండగను। తరళాక్షి నీకింత
...సంబుదగు... యనియూరడించితయ్యెని మాటలాడి। కనుపవనీహాంకర
...ములదుడిచి ... పన్నీరుజలకం... కలికిగుబ్బ... మీఁదికస్తూరిబూ
...యనరంగనిట్లుశయ్యోపచారముల నొ...చియుండిరి యువిదకు...

## చంద్రోదయ వర్ణనము.

నాకాశలక్ష్మికర్ణావతంసంబు। ప్రాకటంబుగ జారిపడినచందమున। తరుణామా కిరణంబుతెల్లంబులగుచు। తరణిపశ్చిమపర్వతంబునకరిగె। క్రమమునసాంధ్య రాగముదశదిశల। రమణశోభిల్లెతామరలుముకుళించె। కలువలు జెలగెచీకటి విస్తరిల్లె। బలవైరిదిశజ్యోత్స్నముపకై నువల। చికిలించుముత్యాలసేసలోయన నగ తెలకించితారలుదివినుండి తెలగె। కవవాసిచక్రవాకంబులకలిగె తివిరిగే హంబుదీపముల్ జెలగె కోకచకోరపక్షులుసంతసిల్లె। జారజోరులుసంతస మునొందిరంత। సురరాజదేవిభాసురతలతోను। ధరియించుకర్పూరతాటంక మనగ। కలువలునవ్వజక్కవలుజింతింపతలపుచువిరిహేలుతర్లడంబంద। ఘన తతోపూర్వదిగ్వామాక్షినొందచనుదెంచెనోయని చంద్రుండుబొడిచె। జా డనెల్లడపిండిజల్లినయట్లు। వేడుకగాముంచివెన్నెలగాయ। నంతలోదమయం తియుదిమోహార్హ్వలేక। వింతించిమదనాగ్నిశిఖలుచెన్నొంద। పలుమారువెన్నె

### దమయంతిచంద్రునిదూరుట.

లబయిటికేతెంచి। తెలచల్వరాతిపైనెలతగూర్చుండి। తలయెత్తిద్విజరాజుతప్ప కజూచి। నలరాజుదలచితేననవింటిరాజు। ననుబట్టియిదేటికేసరిలినేయు। తన కిప్పుడనేమితప్పుజేసితిని। వలదంచుమీర ... విల్కా డునీకల్లుండుగాడె। వేవేలగతులుమా... నేను। ... చిపలుమారు ప్రస్తుతిజేయు। తనజాడమానదుధర్మ... । నున... తడొక్క డుగాడు। తులలేనియలనసంతుండుకోకిలలు। మల... కోమలకోరి కలను। చిలుకలుమొదలుగాజేరినన్నింత। దలచుచుండగ ... నెయ్యామే ను। మగువగదాయనిమనసునలేక। పగచాటెడేపాటిపౌరుషంబోయని పల్కుచుండంగనంతకంతకును। వనజారివేడిమిపడిమూర్ఛపోయె। తెలసిది గ్గునలేచిదివిరాజుజూచి। కలగుచుమరిద... డనుచు। నలరువిల్తునిస్నేహ లన్నియునీకు। తెలుపవచ్చితెమంచి తెరగుజేసితివి। నీవొక్కడవెకాదు నీ వారలెల్ల। నీవిధమేకాదెవెంచిచూచినను। వేజముల్జూచిన వేడుకబుట్టి। దోషకారులురుద్రోహులుఖలులుదుర్జనులు... లుశివద్రోహులువారివ రుసతెంచనిదుష్టవర్తనులనగ। హీనులుమరికాంతిహీనులుచెడిన మేనులుగ లిగియుమేదినిలోన విరహిణీస్త్రీలనువెరపించుకొనుచు। కరుణయులేకగాల మువలెను। దిరుగుదురిదిమహాదీరత్వమనుచు। వనసతోనవ్యోటివారలనెరు

ణగి మూకలై పులుగులిమ్ములమేతకరిగె, తిమిరముల్ దామున్న దిశలకేపో
యె, కొమరొప్పవాల్గుదిక్కులతెల్లవారె, తనయునిపెండ్లికిధరణిధరారి, ఘన
తగప్పినమేలుకట్లోయనంగ, నిందీవరాక్షింకో నెలమిజయింతు, డందివసంతం
బులాడనోయనగ, నిలధరేంద్రములతోనింద్రుండుపోరి, జలజరక్తంబులు చె
ల్లెనోయనగ, నరుణోదయంబయ్యెనంతలోపలను, వరవైభవంబునవాసపుడిడి
న, కొలువులోజగజంపుగొడుగోయనంగ, చెలువొప్పుపూర్వాద్రిశిఖరంబుపై
ద, చలమునహారివేయుచందమోయనగ, జలరాసిపుట్టంబునతిధరియించు, పొ
లుపొందపాపటబొట్టోయనంగ, బలభేదిమెడనున్నపతకమోయనగ, ...
తోయింద్రునివాతిపైనున్న, బటువైనచంగల్వబంతులోయనగ, భా...
డుతూర్పుపర్వతంబునకు, మానుగాజమదెంచెమహియెల్లబొగడ, నంతట—

## దమయంతివిరహంబును తత్సఖులుభీమరాజునకెరిగించుట.

మయంతియనుగుయువన్య, లంతఃపురంబునకరిగియాభీమ, ధరణీశ్వరునిగాంచి
దమయంతితెరగు, పరువడివకవిన్నపమునిట్లుచేసి, వ్రారాజదేవేంద్రమోద
యాసాంద్ర, వారకనీపుత్రివార్తలాలింపు, యొకనాడుదమయంతియుద్యాన
వాటి, సఖులతోక్రీడలుసలుపుచునుండ, వనమునకొదుండివచ్చెనోయెరుగ,
మనురక్తితోడరాజహంసలెన్నెన్ని, చనుదెంచిదమయంతిసంగడివాలె, త
నుగట్టుటకుత్రాళ్లుతాదెచ్చుకొన్న, యనువునవొకయంచనందదబట్టె, కొని
పోవునంతనీకూతురుజూచి, పలుమారుమానవభాషనమ్యంచ, నలునిరూప
ముతద్గుణములుసంపత్తి, యులఘుతినసముంబులనువర్ణించి, వలపుబుట్టింప
భావజుడుకోపించి, విరహంబుబుట్టించివేవేగబోయె, తరుణియంతటనుండిధ
రణీశనలుని, తలచిచింతించుమోదంబునదలచు, పలుమారుదిగులొ...
తాపమొందు, మముజూచిజీరునమ్మదనునిదూరు, కమలారిదిట్టుతక్కకమ
మ్ముగొట్టు, హాయనిమతిదూలునవనిపైవ్రాలు, పాయకమూర్ఛిల్లుపడినేల
బొర్లు, మనుజేశయిటువంటిమదనతాపంబు, కనివినియెరుగమెక్కడనైనమే
ము, మరుబాణవేదనమానునోయంచు, సరసతజె...శైత్యోపచార, మంత
యింతనిజెప్పనలవియెగాదు, వింతలుసుమ్మనివివరింతుమన్న, యిగురుపానుపు
మీదయింతినిజేర్చి, ...రాకులన్నియుజెచ్చెరగమెత్తె, తలచితామరపూలత
ల్పంబునందు...లతుకనుంచినపూలుగానెగసెచల్లనినీటిలోసఖియునుంచిన
న్మకల్లుగాదిదివెచ్చగానయ్యెఘనము ...సరములుమదితకునిడినకొత్త

నీలములా మెఱుసుమా త్రపహ్ని। చన్దనంబలదినజలజాక్షి మేనకన్ది యీతృణ
మునకస్తూరియయ్యె। పన్నీరుకడపలపట్టి తెప్పించి। వెన్నునబోసిన వెలదిశోభిం
చు। మాచేతగాదింక మగువపోషింప। నాచెలి బ్రతుకనీడామన్మధుండు। నెలనా
గసంగతినిక దాచనేల। నలనొప్పపుత్రీగావలసియుండినను। నలునిరప్పింపుమా
నలుడురాకున్న। జలజాక్షి బ్రతుకదు సత్యమీమాట। ఇన్నినాళ్ళీతెరగేర్పడ
మీకు। విన్నపంబొనరింప వెరచియుండితిమి। జాగుసేయగనింక జనదుభూనా
థ। వేగమెనలమహీవిభునిరప్పింపు। మన ప్రముతలయూచియతివలజూచి। మ
నమునచింతించి మనుజేశుడనియె। నాడుబిడ్డకన్న యట్టిమానవుని। పాడిత
పంబులుపౌరుషంబులును। చెడునంచు పెద్దలుచెప్పినమాట। తడయక నిజమా
యెదమయంతివలన। నేమిసేయుదునింక నిటమీద నేను నామహీపతిబిల్వనంపు
టయెట్లునా రాజు ల్వగ నలవియె నాకు। నారాజుబిల్చిననత డేలవచ్చు। నలుడన
గానుర్వి నారాయణుండు। నలునిరప్పించగా నాచేతనౌనె। బలవంతమాననియ్య
బాటిగాదిలను। బలవంతురప్పింపబలిమియు లేదు। నామహీశునిగోరనాతికిద
గునె। బలువిడిమరిమహీపాలురు లేరె। యనితలపోయుచునాత్మజకడకు। చ
నుదెంచి సుకోమున్న చన్దంబుజూచి। వెరగంది యప్పుడు వేవేగవచ్చి। వెరవొప్ప
సంధ్యాదివిధులెల్ల దీర్చి। కొలువుచావడికి గ్రక్కున నేగుదెంచి। నలువైనసింహా
సనముగూర్చుండి హితులగాయక పురోహితమంత్రివరుల। నతివేగరప్పించియ
ప్పుడిట్లనియె। మనదమయంతి కోమలులతోగూడి। యొనరంగ నొక్కనా
డుద్యానవనిని। వేడుకలలరంగ విహరింపుచుండ। వాడకురాయంచలరుదెంచి

భీమరాజు దమయంతిస్వయంవరంబునకై యాలోచించుట.

నలుని। వరరూపలావణ్యవైభవస్ఫురణ। వరుసతో వర్ణింపపదరుచుబోయె।
నంతటనుండితొయ్యలిదమయంతి। చింతించినలునిపై చిత్తంబుజేర్చి। కంతుని
చేజాలగాసిల్లెననుచు నింతులు జెప్పిరియింకేమియనిన। వినిసభవారెల్లవిభు
డువీక్షించిజననాథయిందురుసంతాపమంది। నేలమేమొక కార్యమెరిగింతునిపు
డు। భూలోకమునను న్న భూనాయకుండు। ననరుహాక్షికిస్వయంవరమహా
త్సవము। యని చెప్పిపంపినసప్పుడానలుడు। చనుదెంచునకలరాజన్యులువత్తు
రనవినియిది కారణమౌనని చెప్పి। [illegible] మునచారులరప్పించిజూచి। ప్రియము
రెట్టింపంగ భీముడిట్లనియె। నరుదారసి [illegible] శుడాదిగాగల్గు। ధరణీశ్వరులనెల్లత
గాంచి। కలకంఠిదమయంతికన్యకకపుడు। [illegible]లనుమీరినస్వయంవరమనిచె

సవేగ-యోగవాగము లెక్కి-యొగినారదుండు- బాగుగా శ్రీపతి బాడిసొక్కు-
చును- ధరణీశ ద్రిప్పుచు దమయంతినంద - మెరిగియావృత్తాంత మెల్ల వేవేగ।
పురుహూతునకు జెప్పభోరున దివికి-నరిగి మానిల్లంతట జూచి-కిన్నరగంధర్వ ఖే
చరగరుడ-కిన్నర దేవదిక్పాలకుల్గొలువ-నలరిన నృత్యంబు రంభాద్యప్సరసలు
సలుప బంగారు గద్దియ చయ్యన డిగ్గి- యెదురేగి భక్తి దేవేంద్రుండ మాని- పద
ముల కెరగి శుభ ప్రాప్తి కెల్ల- పద్య బులొసగి కాంబ సిడిపీఠమున- విద్యానిధిని
యోగివిభు నంచు భక్తి-పూజించి చేతులు మొగిడిచి యింద్రు- నాజటీంద్రుడు
చూచియ పుడిట్టు లని యె- [illegible] రనాథ విను మొక శుభవార్త నిపుడు- ధరలోన నా
కవి చిత్రంబును బుట్టె-విను ముఖీను భూపాలుండ భేద్య విక్రముడు- సోమార్క వి
భుడు భాసుర గుణోజ్జ్వలుడు- ఇల విదర్భ పురంబు నేలెడు రాజు-వల నొప్పు నతనికి
వర పుత్రికైన-యలి వేణి దమయంతి యను కన్యగలదు- తలపుల దాని సౌందర్య
సంపదలు-వనజాసనుని కైన వర్ణింపరాదు- వినుము నే చూడని వెలదలు లేరు-
చూచితి పార్వతి చూచితి లక్ష్మి- చూచితి భారతి చూచితి రతిని। చూచితి శాచను
చూచితి సచిని-చూచితి మేనక చూచితి రంభ- నొక్కడ కలివిని మెరుగ మెన్నం
డు-నక్కమలాక్షి నలావనీశ్వరుని- మదిలోన గోరి మన్మథ బాణ వేధ- బెదరి క్ర
ంపగా భీమ భూవిభుడు-నలుని దెచ్చుటకు భూనాథుల కెల్ల- నలదమయంతి స్వ
యంవరంబునకు-రండ [illegible] నావిధ-మండలాధీశ్వరులాదిమాన వే
శ్వరులు-హయకుంజర స్యందన వారూథులు [illegible] రయమున నా విదర్భ పురంబు
జేర-బోవుచున్నారదె భూలోక వార్త- దేవేంద్ర నీకును నే దెలుపవచ్చితి-తగు
నీకు దమయంతి తగదన్యులకును-వగ భేదియని చెప్పి నారదుండరిగె- సురనాథు
డధిక తేజోమూర్తులైన। [illegible] కృతాంత [illegible] పనుల ముప్పురను। గనుగొని సంతో
షకలితు డైవలికె-మనమును లుర్వరము నేమ [illegible] ర్త్యమునకు-బోయి యందు వి
దర్భ పురమ్మున జొచ్చి - [illegible] గనుగొందము [illegible] - బర తెంచి [illegible] లు
పుర పట్టణో సరిని-పుర లక్ష్మి [illegible] వంబును చూచుచు [illegible]-దంపతులు [illegible] సేన
లు చుట్టి నిల్వ- నరు దెంచి పురవీధి గరుగుచున్నట్టి- నలుని గన్గొని తన్ను గరభామి

—*( విదర్భ పురజనంబులు నలుని వర్ణించుట )*—

నులు-పాలు పొంద ప్రాకారముల గోపురములు - తలవాకిళులు [illegible] తప్పు మిద్దె
యులనిచి। యున్న లధారుని విభుని బూ [illegible] రంద నందంద గుంపులు గూడి। ప
మదలొండొరులతో భాషించిరిట్లు-మా [illegible] రేయా రాజ సొంపుమ సెంపు- వే

విభుఁడ మాబుద్ధియొకటి గలుగు - నావుడు చిఱునవ్వునవ్వి భూవిభుఁడు - దేవేంద్రుఁగను
గొని ధీరుఁడై పలికె | నది యేమి దేవ నీ కిటువంటి మాట | యాద యమునీవ లెన్నిట్టు లాడఁ
గదగునే - యందంబు భూనాథులకు యుచుఁవచ్చు | నందాక నేను నాజన్మ మెంచి చూ
డ - నాకంజలోచనననుకూలపరచు - నాకు జెప్పఁగ నీకు న్యాయమా దేవ - యె
ఱ వెఱుక నుమ్ముదితనుంచి - జెందిన వేడ్క భాషించియున్నా నె - బాలుఁ బొంద
యున బోయి వచ్చినను - వెలఁది యునామాట వినునె వలదనక - పన్నుగా నిట
పనులకుఁ బోవ - కన్న వి విన్న దికల దెపుడు రలను | పాయక నిటువంటి పనులు నావ
సేయుటకు గాదెపు సేవఁగావించుదునింత యేగాని - యామతి నిమీకు సంతసంబున
బుద్ధిజాలదు గూర్చ - చేరి యీపనులు నేర్చినవారి బిలిచి - యారమణీమణి పత్రిం
వు మొండడ వవుడు పురుహూతుఁడా రాజుఁ జూచి | ఘనకృపారస మొల్క గానిట్టు
లనియె - నినకులాధీశుని నే కార్యమైన - ననుకూలపరచెదనంటివి యిపుడు పనిబడె
మే మొక్క పనికిఁ బొమ్మనిన - వినయము ల్బలుకుచు వెలఁదులకడకు - పోకయివ్వ
డే బొంకి తీననిన - పాలించి యేమన బోయెదమింక - పరువడి సత్యసంపన్నుండవ
నుచు - సురలు జెప్పఁగ నిన్ను జూడవచ్చితిమి - కరమొప్పదబ్బాఁకాడపటంచు -
నెరిగితె మెంపు మేలై తెవచ్చెదము - జగతి యిక్ష్వాకువంశజు లెల్లమున్ను - బొగడ
నకీర్తుల బొందిరి తొల్లి! - తొలి యిట్టివారి వంశమునందు నీవు - పుట్టెదబ్బరలకు
పుట్టిల్లవైతివి - మేలు చేసిన నెన్నటికినైన - మా మనంబుల నిన్ను మరువంగ లేము
నలరాజు సురరాజునకు బెండ్లి జేసె - నలి వేణి దమయంతి ననిరమానాథు - డెరిగి
తేని నుమెచ్చు పెద్దకాదె - ధరణీశలేశ యీదనుజోరిమైన - మా కార్యమనిన
తామసమింత లేక - జేకొని కరుణతో జేసి రక్షించు - ధరణీశ మామీద దయలేదు
మీకు - నెరిగెద విందుల కేమిగా నిమ్ము - చని యెదమికననిచర్చించి పలుక - విని
చాలమదిలోన వెలవెల బారి - కరములు ముకుళించి ఘనభక్తిమీర - ధరణీశుడా
పురందరున కిట్లనియె - సురనీ బంటునై యుండెదువాడ | ననఘాత్మ నామీద నత్యం
తకరుణ - గలిగి వచ్చితి టుగాన నే నిపుడు - నెలమిని నా దమయంతి దగ్గరకు - నర
యు నేదే గతి నరుగుదు ననుమ - కరుణాసముద్రయీ గతిని బల్కితివి - యకట
యీ దమయంతి యంతఃపురంబునకు - పోతు టీగయైన నుపొందరాదు - గావున
నిప్పుడి కార్యమెరీతి - కావింతు నీమాట కపటము గాదు - తడయక దానియంతఃపు
రంబునకు - నుడువను పాయంబు నాకెఱిగింపు - డనవిని శైలారి యాత్మమోదిం
చి - మను జేశ్వరుని జూచి మగియునిట్లనియె - దమయంతి కన్యకు దానియింతు

లకు- క్రమమునసీరూపునుపించుగాక- నితరులకెవ్వరికెరుగంగరాక- పతి తోనుభాషించిచనుదెంచుదనుక-ననియొప్పవరమిచ్చియురూగుమాటంచు- పని చినవారికిభక్తితోమ్రొక్కి-చనిచనియాభీమజననాయకుండు- పెనుపొంద పురోహితులతోపేరోలగమున। నామెడగూర్చుండెయాలోచనంబు। సేయంగనొక కొంతసేపుండిచూచి-యరుదైనకనకహార్మ్యంబులుగడచి-మెరసెడిబంగారు మేడలుగడచి। సరసతచిత్తరులచవికెలుగడచి-వరునతోంగడప పువాకిళ్లుగడచి యక్కడక్కడనిల్చియంతఃపురంబు-నక్కజంబుగదాటయాదమయంతి। నలు నిరూపంబులునలువురుదాల్చి- కొలువుననలుచెంతగూర్చుండిరంత- భీముం డుదాదు పిలిచిమీరింక-కామినిదమయంతికన్యకామణికి- కడువేడ్కమీర శృంగారిన్చివరము-లడుగంగదేవాలయంబునకరిగి- శ్రీరమాపతిపూజింపంగ జేసి- కోరిచయ్యనదోడుకొనుచురావలయు- ననుటయుదమయంతికాయిం డుముఖులు-జనితేటపన్నీటజలకంబులార్చి - మెరుపడీజిలుగుతోమెయిదడి యొత్తి-నురులార్చివింతగాకొప్పగీలించి- వరచంద్రకావిపావడమీదమించి- వరలుసన్నపుచల్వలువజాగొప్పగట్టి - గుబ్బలమీదకనకంబుపూల - పట్టు కంచుకమునుబాగుగాదొడిగి-తీరుగామృగనాభితిలకంబుదీర్చి కస్తూరిజవ్వా డితోగూర్చినమంచి- హరిచందనముమేననందందబూసి- విదితముల్ గొప్ప నింతగాదురిమి- పటుసూర్యచంద్రులపాపటబొట్టు- నిటలంబుపైవ్రాలినిలిపి కర్ణములకరమొప్పుబంగారుకమ్మలుబెట్టి- కరములవజ్రాలకడియముల్ బె ట్టి-నీలంబుముంగరనీటుగాబెట్టి-లాలితంబుగనుబిళ్ళలదూలమర్చి- కరముల ముద్దుటుంగరములుబెట్టి - మెరయుహారంబులుమెడనిండనుంచి- తెలిదంమి రేకులదెగడెడుముద్దు-కలికికన్నులమంచికాటుకబెట్టి। ఘనతరనవరత్నకాం తులచేత- ద నజిగినపంగిదండలుబెట్టి - పల్లేరుపువ్వులపసిడితీగెయును- మొల్లమిగాజులుముంగారుమురుగులు- తిలకంబుపసిడిచుందిహులాదిగాగ- నలభూషణంబులుకన్యకామణికి- ధరియించివేడ్కశ్రీధరుమందిరమున- కరు దెందదోడ్కొనిపోయిడిగిననింతి- కరములుముకుళించికన్యాలలామ- పరమా త్ముడైనశ్రీపతినీక్షించి-భయభక్తిమీరసేర్చునస్తుతి చె- జయభక్తమం దారజయ సింహాకార- జయనిత్యకల్యాణజయజగత్త్రాణ- జయపద్మద ళనేత్రజయనీలగాత్ర-జయకరుణాపాంగజయకీర్తిసాంగ-జయపాపసంహార జయశుభాకార-జయబాహుబలధుర్యజయదేవవర్య-జయభోగసుత్రామజ

రేశ్వరులకు-మునుకొని చెయ్యెత్తి మ్రొక్కి-యిట్లనియె - నిందేలనట్లో
టువంటిపతులు-కొదుకక సేయుమీమాట తగుగానె- నైజరూపములు దాల్చిన
లందరేంగ- రాజిల్ల సమ్యక్ప్రకాశము గాంచి- నాకాధిపతులారనలునికి
నన్ను-చేకూర్చి పెండ్లిగావించియా వేళ- కన్నులారగ జూచి కరుణతో నలుని
నన్ను దీవించిమన్నన జేసిమీరు- వేంచేయరయ్య నా వెర పెల్లమాన్పి- యను
చు వేడిన మెచ్చియతిదయామతిని- ప్రముదితచిత్తులై బలభేదివహ్ని - జము
డు నుపరుణుండు సత్వరంబునను - తమతమరూపముల్ తప్పక దాల్చి -
మరంగ గనుపడిరందరికప్డు - డాలోన నలుని నెయ్యన చేరి పుష్ప - మాలి
ధరియించె మగువకంఠమున - దివినుండిభూషించె దేవదుందుభులు - భు
మీదగురిసెపువ్వులవాన - పాడిరిగంధర్వపతులు మోద న- నాడిరి యెను
రరంభాదికామినులు - నిర్మృతివాయుకుబేరనీళగళాది - హరునిదధీశులున
లామరుల్లెవిని - వాసవానలయమవరుణులుభువిని - వాసికెక్కినరాజ నీవా
ధుబాగడి - రలఘునద్భక్తిభీమావనీశ్వరుడు - నలునికిత్రిణంచేసున్నతిమిరా
రనిపుడు - వెలయంగ దేశాధివిభులెల్లవచ్చి - నలమహీశ్వరునకు నయముబు
తో మ్రొక్కి - పోలుపొందతమపురంబుల కేగిరంత - నలరుచు దమయం
నాత్మలో నెన్ని - పాకశాసనుడు దిక్పతులతో వచ్చి - చేకొని నలరాజశే
ఖరునపుడు గ్రుచ్చి కౌగిట జేర్చి కువలయాధీశ - యిచ్చుగా నీవు మాకాప్పు
విలచు-చిరభక్తితో నీవు చేయుజన్నంబు- కరుణమీరంగ నేనుగ్రహించుకొనుచాడ
మనవకుమా మీద మక్కువలనుచు-ధరణీతలంబునెంతయు చిరకాల- మ
రక్తి పాలింపుమని యానతిచ్చె-ననలుడంతటవచ్చియవనీతలేశ|నీవు నన్నే వెల
డనెమ్మి ప్రార్థింప-నావంక నిలిచెదననివరంబిచ్చె-జముడంత నేతెంచి జననా
చంద్ర-రమణని వెంతధర్మము సేయుదలతు-నారూఢి నేనిత్తుననివరంబిచ్చె-నా
రథయుటవచ్చినరలోకనాథ-నిరుపమశౌర్యంబునీకోర్కొలది- నరయు
నేనిత్తునని వరంబిచ్చె- వరుణుడంతటవచ్చివసుధాతలేంద్ర - చిరకాల మే
నీక్షితినని పతికి-వాయుదేవుడువచ్చివసుధీశ నీవు- నాయుతగతి వేగమబ్బు
చనియె - ధనపతివచ్చి యో ధరణీశ నీవు - ధనమెంతగోరిన దానిత్తునని యొ
మ్ముదుడపదెంచి యో మేదినినాథ- యడిగినమహినిత్తునని వరంబిచ్చె- స
దుముదమందిరుంమహీశ్వరుడు - తప్పక వారికిదండముల్ బెట్టి- వినుతిం
చారలునిసువీధి కెగసి- జనిరి వేగమున నిర్జరలోకమునకు- నల్లునికూతురుపస

జోడుకొనుచు। మెల్లన నప్పుడు మేదినీశ్వరుడు-చిరమైన పెండ్లిపన్దలకేగుదెంచి
కర మొప్పు నవరత్నఖచితమైనట్టి। బంగారుపీటలపై వధూవరుల। సంగనలటుని
ల్చి హారతులొసగ। నవనీసురాన్ననలతివేడ్కతోడ। ధవళముల్పాడంగ దండివా
క్యములు। పటుహధ్వనులు నభోభాగంబునిండ। తటుకున భేరీమృదంగగంభీర। ర
వమున ధారాదరములు ఘూర్ణిల్ల। కవకూడి వంధిమాగధులకీర్తింప। సంగతి
గావాగసరములు బాడ। సన్నీతవాద్యఘోషమ్ములు చెలంగ। బూరగల్మించుకొ
మ్ములు కాహళములు। భోరుకల్గుటకునంబుధులెల్లనల్ల వేత్తలై హాహామహం
త్సేల్పించి। భూసురోత్తములతుతలొసగదీవింప। నెలమివారాంగనల్నృత్తము
ల్సలుప। చెలగి పుణ్యస్త్రీలు సేసలుజల్లి। పలుదెర గులను శోభనములు బాడ।
చెలువొంద పెద్దలాశీర్వాదమొసగ। తరలాయతాక్షి నిదమయంతినపుడు। నిల
పతినలరాజునకు దారబోసె। హరుడు పార్వతియనుయమరినయట్లు। సరసిజా
క్షుడు మాజలజాక్షియట్లు। సరసిజాసనుడు శారదయట్లు। నెరిశశాంకుడురో
హిణీదేవియట్లు। తీతెదరాహితుడు శచీదేవియట్లు। లతివిభారతియుఛాయాదేవి
యట్లు। తిలకించిరట్లు పెండ్లిదినములుగడపి। పలనొప్పబెండ్లికివచ్చినవారి। భోజ
నంబులిద్పప్తిబొందించి మిగుల। రాజిల్లు వహనములజిలుగుంబరములు। దనరు
భూషణములదనిపి పిట్టాలిపి। ఘనలీలవందిమాగదకవి దుల్లకు తొడవులు
దొరలవస్త్రములను నొసగి। తడయక బహురత్నతతులనొసంగి। వేడుకమీ
రని వ్విధనమున పెండ్లి। పోడిమి జనులెల్లపాలుపొందజేసి విరుమానామానని
త్యసంపత్తి। సుఖుతిరసుఖలీలనుండిరంతటను। గలకంఠినమయ అకన్యకామణి
కపరనొప్పమున్న స్వయంవరమును। వార్తవిని లిగినాపపవిభుడువేగ। తన
లోసనతులసంతాపమ్మునొంది। యపుడు పెండ్యాడగానాత్మలోగోరి। విపరీతబు
ద్ధులవివరించుకొనుచు। తలవెంటుకలుపీడతగ్గింపుచును। జలజలమనిఘుర్మ
జలబిందులురుల। బరువున నేతెంచి బలిసిదిక్పతులు। గరుడఖేచరయక్షగంధర్వ
సిద్ధ సరసవిద్యాధరచారణసాధ్యసురయక్షపన్నగుల్బట్టిచుకొలువ। కొలువు
న్నయిందురిని గొబ్బున గదసి। బలవైరి మాకొక్కపనిగలదదియు వినుము చెప్పె
దధరావిభుపుత్రియొక్కతె। జలజాయతాక్షి భావజుమేటిదంతి। దమయంతియ
నియెమతరశాక్షి కలదు। కరిము మొప్ప దానికముపేడ్కతోడ। నరయస్వయంవ
రమనివింటినే నుదరయుందు దాని సౌందర్యసంపదకు। సరిరారెరంభాది సారకా
మినులు। తరముగా చక్కదనమువర్ణింప। సరగునజని మొము సఖినివర్ణించి।

వచ్చితిమిటకు, నావరనాయకున్డవనిలోపలను, నీకుసాధ్యుడుగాడునీకసాధ్యు
న్డై, ఓకలిరాజనీవూరకనింక, కోపంబువానిపైకూడదామాట, పాపంబువ
చ్చునీపనిసేయగూడ,దనవినిమరియు రౌద్రాకారుడగుచు, ననిమిషపతితోడ
ననియెనాతండు,కనలియీరేడులోకములనాకన్న, ఘనుడెవ్వడున్నాడుకం
టివేనీవు, వెరగొప్పనాపేరువిన్నమాత్రమున, హరిహరబ్రహ్మాదులంతటివా
రు, వెరచిచుట్టనురాగ వెరచియుండుదురు,గరుడఖేచరయక్షగంధర్వఖచరవ
రులైననామాయవర్ణింపలేరు, సురనాథనానేర్పుజూచెదనింక,నలుడనియె
డియొకనరుడునావద్ద,నిలిచియుండునెచూడునీవుమెచ్చెదవు, దమయంతినా
చేతతాబడుపాటు, రమణియెవ్వతెబడురాజ్యంబులోన, నేనుగోరినయట్టినె
లతనువచ్చి, తానుగైకొనిపోవతానెంతఘనుడో, వానితోచలపారవానినే
బట్టి, పూనిజూదంబాడబుద్ధిపుట్టించి, మాయలుజేసియామహినెడబాసి,పా
యకపయినున్నబట్టబోజేసి, గారించియిలగోచిగానిగావించి, యారణ్యభూ
ములనలయంగజేసి, మానినినెడబాసి మనసునొప్పించి, దీనతనొందితెలివిద
ప్పించి, మారురూపముజేసిమహిమరప్పించి,గావించెయమితదుఃఖములనొం
దించి,కుండగోరికజేసికువలయేశునకు, వండిపెట్టగజేసివానినీరీతిచీకాకుబడ
మాయచేయుకనున్న, నాకేళవినుమిఁనేనలునికిబంటు। నాథుడవీక్షింపగానం
దాకకలిని,గాదనియీరీతిగామహాప్రతిభ, బలికియింద్రునితోడపరువునవపు
డు,నిలిచినచోటనునిలువంగలేక, ప్రాకటంబుగవిదర్భపురంబుజొచ్చి, యా
కోపముననిషధాధీశుడైన, నలరాజచంద్రునిసమయముగాజూచి, కలియెంత
మాత్రముగదియబోవెరచి, యాతనిసత్యంబునాతనిశౌచ, మాతనియాకా
రమంతయుదెలిసి, కుతలాధిపునిజేరగూడదటంచు,నతడెందుదిరిగినదివెల్ల
గనుచు, నక్కడక్కడగూడియుందందదిరిగి, కక్కసపడుచు కోపముజెందు
చుండె,నంతగొన్నినాళ్ళరిగిననలుడు,సంతసంబునభీమజననఘగాంచి,యొ
కమాపురంబునకేగ్గవలయు।నకలంకనీపుత్రినంపించుమనిన।నటువలెజేయు
దుమవనీశతిలక, కుటిలకుంతలతోడుకొనిపోవనిచట,నున్డుమన్ననుమీరలుం

—(నలుడుదమయంతితోడస్వర్గంబునకేగుట.)—

డురేయనుచు, వెంబడియుబలికిభూవిభుడుమారి, నామెడబాడగాంచియు
తనికిట్లనియె, వోయమ్మనీమగడొగిపురంబునకు!బోవలెననినీవుబోయిరమ్మ
నిన, వావిరిదమయంతి వగచుచునప్పుడు, తల్లివద్దికివచ్చి తనమానసమున,

తల్లడింపుచు బల్కె తండ్రినన్నిపుడు, తనయల్లుడూరికి తర్లి పోదలంచి, నను వెంట
నంపుచున్నాఁడరిగాన, నాతని వెను వెంట నంపుదుననుచు, నాతోడ నెరిగించి
నాఁడె యోయమ్మ, యనవుడు తనపుత్రి నతివ కౌఁగిటను, మనిచి పోయని యేడ్చి
యోయమ్మ యనుచు, నను బాసిపోయెద నా ముద్దులాఁడి, యనితల్లి పుత్రియు
నందంద యేడ్వ. దమయంతి దాదులు దాసజనంబు, గుంపులుగూడి యందఱు
గోయని యేడ్వ, చనుదెంచి భీమభూజననాయకుండు, తనపుత్రినూఱార్చి తన
యింతి దెలిపి, దాదుల వారించి దమయంతి జూచి, యాదరంబున బల్కె నదియే
మితల్లి, యేలయేడ్చెద నీవు కేమిట కొదువ, లాలితసౌందర్యలక్ష్మావ్యయుఁడు,
యిలయేడుదీవుల నేలెడు రాజు, నలరాజచంద్రుండు నరలోకనాథు। డట్టిభూ
నాయకుండతివ రోసన్ను, నెట్టన జేపట్టెనీ కేలవగవ।నరలోకసుతుఁడయి నలచ
క్రవర్తి।యరయ నిన్నుంచినాకల్లుడై యొప్పె। పెక్కు కాలము నాకు బిడ్డలు లే
క।మక్కువ నిను గాంచి మాన్యుండనైతి, సురనాయకుల గూడ చూడంగ గలిగె।
కరమొప్ప చిరకీర్తి గలుగుట జేసి।యిందీవరాక్షి నీ యిందును నందు।పొందుగా
వచ్చును బోవుచునుండు।మమ్మరోసియన్న నంపుదు వెంట।సమ్మదంబున బోధి
చను దెమ్ము నీవు।మనమున దుఃఖంబు మానునో యమ్మ।నిను జూడ కెన్నాళ్ళుని
ర్వహించుదునె। పెనుపొంద వెంట నేపిలువనంపింతు। ననిబుజ్జగించుచు నాదర
బుద్ధి। తనపుత్రి నలునకు తగనొప్పగించి। తనయకు తరణంబు లనికంగ నిచ్చి।
బోయిరమ్మని పల్కె పొలతి శోకమున। బాయక తమతల్లి పదములకు వ్రాలి।గ్రుచ్చి
కౌఁగిట జేర్చి కోర్కె దీవించి।మచ్చిక గురుభక్తి మానకెల్లపుడు। మతిలోన స్త్రీ
లకు మంగళంబైన।సతత పతివ్రతాచర్యల కడకు।ప్రతిమాటనడచుచు పరిచర్య
జేసి పతిని శ్రీపతిగాగ భావింపవమ్మ।వసుమతి మనపరివారలలోన।పాసగ సత్కీ
ర్తులు బుట్టింపవమ్మ।మదిరాక్షి చెలువొందమనవంశమునకు।వదలక మరియు
కవన్నె దేవమ్మ। కుసుమకోమలి బంధుకోటికీర్తింప। వసుమతీశుడు మెచ్చవ
ర్తింపవమ్మ।సరసత నాథుండు చనువిచ్చునపుడు। సరిమురిపలు మాటలాడకు
మమ్మ। యనిముద్దు బెట్టి చయ్యన బుద్ధి చెప్పి। మునుకాల మోమున మోమును
చేర్చి। నాయమ్మ నాకూన నా ముద్దు చిలుక।పోయిరమ్మనవుడు పోయి తండ్రికి।మ్రొ
క్కిన దీవించి దొయిగి బుద్ధి చెప్పి।గక్కున నవరత్నఖచితమౌ శిబిక। లోలోన నీరేజ
లోచన నుప। నాలోన నరుడొక్క యరదంబు నెక్కి। మామను వీడ్కొని మగు
వయు బాసు। ప్రేమతో దమయుండు వెంబడి రాగ। కరిరథభట ఘోష కంబులు

గొలువ- తరుపముప్పదిరెండువాద్యముల్ మొరయ-వారకభటులుకయివా
రంబు సేయ। వారకామినులిరువంకలవాడ। చేరిపుణ్యాంగనల్ సేసలుజల్లధారు
ణీసురులు బాంధవులుకీర్తింప, దివినుండి దేవతల్ దీవించుచుండ,నవనిపువ్వుల
వానలు:తటగురియ। మనుజేంద్రుడిటువంటిమహిమశోభిల్ల, జను దేరనప్పుడు
సంభ్రమంబెసగ, పురమువారెల్లనుప్పొంగుచుకూడి। వసుసతో నెనరుగాన
చ్చివీక్షింప।పరివారజనములుభక్తి సేవింప।నరపతితనపట్టణముప్రవేశింప।పుర
సతిజనములప్పుడతివేడ్కలలర। గురుతరప్రీతి చేగుంపులుగూడి।దమయంతిగ
నుగొనితమలో నతాము। ప్రమదమెలర్పగా బలికిరిట్లనుచు। నీమానినీమణిస
దెజూడరతన్ని। రామాభిరామనిర్భరపుణ్యసీమ। సీమగాదిదిమంచిచెలువయిన
తేమ। లేమగాదిదిమంచిలేమావికొమ్మ। కొమ్మగాదిదిమంచికులుకుకౌందమ్మి-
తమ్మిగాదిదిమంచిలావణ్యప్రతిమ। ప్రతిమగాదిదిపుష్పబాణునిదంతి। దంతి
గాదిదిరతితగమెచ్చుకాంత। కాంతగాదిదిసీటుగలబోగికన్నె। కన్నెగాదిదిమం
చికర్పూరంపుదిన్నె।దిన్నెగాదిదితావితేటపన్నీరు। నీరుగాదిడిచిన్నెలరాజుతీ
రుతీరుగాదమ్మ-ఈదేవిలావణ్య।మంతయునుసర్ణింపనలవియేమనకు। వింతగాన
బియిట్లు వేవిధంబులను। వినుతింపనలమహీవిభుడెప్పిధమున।దనరారుశుభము
హూర్తంబునతనదు। నగరుప్రవేశించెనాతియుదాను। జగదీశులునుమహా
జనులు బాంధవులు। హితులుమంత్రులుపురోహితులునుదదను। మతినేగిర
టతమమందిరంబులకు।నంతటదమవాఖ్యకామహీశులకు-సంతస బునమ్రొ
క్కి-జనవాథయేను।పొలుపొందపురికిపోయివచ్చెదను।కలకంఠిదమయంతిక
న్యకామణికి- వయసుమిక్కిలి లేదువసుధాతలేశ। దయనేలుకొమ్మని భర్తాని
మమ్మొంచి।యనివిన్నపము జేసియాదమయంతి।గనుగొనిమదిబుద్ధిగలిగిభూవి
భుని।మర్మంబులెరిగిసమ్మతిభక్తి వెలయ।ననిగాలినడువు నయముతో నిన్ను
నరయుంగనూరికినరిగెదననిన।తరళాక్షిదమయన్తిప్పకజూచి- కన్నులగడు
బాష్పకణములుదొరుగ। నిన్నాళ్ళవలెనుండకిట బుద్ధిగలిగి। యున్నప్రజలెల్ల
మహిమెచ్చిపొగడ। నన్నికార్యంబులనరసిసద్భక్తి। తల్లిదండ్రులమాటబా
టకరాజ్య। మెల్లనేలుము ప్రజలెల్ల సంతసిల్లుటచేత। మెచ్చుకీర్తులచేతమె
లగుమోయన్న। నిచ్చేయుమనుచు వేగంబెయతడు। తనబలంబులుగొల్వతన
పురికరిగి।తనతండ్రిగూడిభూతలమేలుచుండె। నంతటనిషధేశుడాదమయంతి।
సంతసంబునగూడిసరసులయందు। కేళీవనములందుకృత్రిమాద్రులందు। మేలి

మిహాదలందు మేడలయందు । నిరుపమానవిభూతి నిరతంబునిట్లు । సురపభా
వురకేళిసాక్కి-సోలుచును।శ్రీరామచంద్రునిరీతిసంప్రీతి। ధారుణీచక్రంబుతగ
నేలుచుండె।ననియిట్లుబృహదశ్వుడాధర్మజునకు। పెనుపొందమునున్నగావిన్న
మార్గమున । వరుసతో నలచక్రవర్తి-చరిత్ర-సంపదలు మెచ్చవిస్తారంబుగా
గ।వినుతవాక్యంబులవెలయంగ జెప్పె।ననుచువాధూలగోత్రాబ్ధిచంద్రుండు
చిరకీర్తివంతుడాశ్రితకల్పతరువు।కరుణాపయోనిధికందాళదొడ్డ।యాచార్య
నకుశిష్యుడై నట్టివైష్ణ।వాచారతత్పరుడతిదయాపరుడు।పాలుపుమిాఱినచక్రి
పురవిహారుండు।వలనొప్పనతనికివరకుమారుండు-యకలంకమానసుండమిత
పుణ్యుడు।సకలవైష్ణవపాదసంసేవకుండు। రంగనాయకత్యుండు రాజపూజి
తుడు।సంగీతసాహిత్యసత్క-ళావిభుడు। సరససత్క-వివరసద్భూషణుండుయుర
యంగనాతనికనుగుసోదరుడు । తనరినయాంధ్రవిద్యాప్రవీణుండు। జనలోక
విదితుండుసజ్జనహితుండు।తిరువెంగళార్యుండుధీరాగ్రగణ్యు । డరయునాతని
పుత్రుడబ్ధిగంభీరు- డమలమానసుడవిద్యావిశారదుడ-రమణనేవరకు విరాఘు
వాహ్వాయుడ నరహరిఘటికాద్రినాథునిపేర।పరువడినాంధ్రభాషలవెలియ
నవని।శ్రీహరిదాసులయినట్టిసరస।కవులసత్కృపనాకుగలుగుటజేసి। యీనల
కథయందునిదిపూర్వభాగ। మేనురచించితినీచరిత్రంబు। నెవ్వారుజదివిననెవ్వారు
వినిన- నెవ్వరువ్రాసిననవనీశుకరుణ-నాయురారోగ్యంబులైశ్వర్యములను-
పాయకుండగపుత్రపౌత్రసంపదల- నాచంద్రతారార్క-లై యుందురెలమి-
భూచక్రమునపరిపూజితులగుచు

—:(*):—



# నలచరిత్రము - ద్విపదకావ్యము.

## తృతీయభాగము.

### దమయంతి పతులిల బడయుట.

శ్రీకరచారిత్రశృంగారగాత్ర-పాకశాసనవేద్యభవరోగవైద్య-చిరపుణ్య
కీర్తి-యాశ్రితనుతకీర్తి - కరుణానివేశశ్రీఘటికాద్రివాస- యవధరింపుము
పాండవాగ్రితనూజ దవిరళమతి మోదనాదమయంతి- పరిణయక్రమమెల్లభ

త్రికిశోభిల్ల। నరిమురివినివిస్మయానందుడగుచు। శిశములుముకుళించిఘనయో
గిచంద్ర। యెరుగింపుమటుమీాదివృత్తాంతమెల్ల। ననవుడుబృహదశ్వుడాలా
జుచూచి।వినుమనవేడ్కతోవివరింపదొడగె। నంతటకొన్నాళ్లకాదమయంతి
కాంతాలలామంబుగర్భంబుదాల్చ। పరిపూర్ణసోమునిబడలించుమోము।దో
రకొనివేగునిచంద్రునిరీతినుండె।నవిల్తుపూచెండ్లనందగుచనులమొనలనల్ల
నివర్ణములుగానుపించె।మృదబింబములవన్నెమెచ్చనిమోవి। కదసిమలినం
బుగప్పినట్లుండె- బడలికల్ మేనునబర్వెనందంద- నడుముమందంబాయెనాభి
గప్పడియె- పవరణనల్లభూపలవేదుబోలె-నవిరళంబగుచునూగారుజూపట్టె-
కలికిచూపులచంద్రికల్ బర్వెననగ-పలుచబారెనుగండపాలికాయుగళి।మలి
వేణిముఖచన్ద్రుడమృతంబురసము।చిలువచందంబునచిట్టములెసగ। గగనభా
గంబుయాకరమైనయొప్పు,పగిదికౌదీగెచూపట్టెనానాట।పొలుపొందునవమా
సములుపూర్ణమైన-నలరసముత్తగ్రహంబులువరుస-తప్పకతమతమతావుల
నుండ-సప్పుణ్యలగ్నంబునందునయ్యింతి- మరువిభుండైనకుమారునిగనియె-
పురుహూతుసమునితత్పుత్రునిజూచి-గురుతరమతితఃకులగురువయిన- గురు
పువసిష్ఠునిశీఘ్రరప్పించి- ధారుణీసురులబాంధవులనాగరుడ- కూరిమినందరి
గూడరప్పించి - యంతటగురునాథు ననుమతంబునను - సంతోషచిత్తు
డయిజాతకర్మంబు - నలరంగజేయించెనపుడుపుత్రునకు - చెలువుమీరగ
నింద్రసేనాహ్వయంబు-నొనరంగబెట్టిపుత్రోత్సవంబెల్ల-ననురక్తిజేయించెన
పుడుభూసురుల-కాదిభూదానకన్యాదానములను। గోదానములజేసికుతుకం
బెలర్ప-తక్కినవారికందరికభీష్టముల।మక్కువనొసగియిమ్మహినేలుచుండె।
నదియెల్లగనుగొనియాకలిపురుషు-డెదలోనచింతాసమేతుడైయపుడు-దమ
యంతితోగూడధారుణీశ్వరుడు- కామతునిబడసియీకుంభినినెల్ల- నేలుచు
న్నాడనేనిటవచ్చియెంత-కాలమాయెనుయింతఘనుడొటనెరుగ- నెరిగిననే
నేలనిందువచ్చెదను-హరిహరబ్రహ్మదులంతటివారి-నామాయబడవైతు న
రులునాకెంత- నేమినేయుదునింకనేవిచారంబు- కామరువల్లనుజెడ్డకోమటి
వలెను- తెమలకవెనువెంటతిరుగబోయెదను- వనజాక్షికినిస్వయంవరమన్న
మాట- వినిదానివరియింతువేవేగననుచు- పురుహూతుకడకేలబోయిచెప్పి
తిని-సురనాయకుడుమున్నుసుదతినిగోరి- పోతిమినీవేలపోయెదమనుచు-నా
తోడనతడేలనవ్వుచుజెప్ప।గోపించియప్పుడాకుథరాతితోడ।నేవునచలపట్టిప

గతినైన-కలచిగారించెగాక నేసనుచు। పలుదెరంగుల నేలపంతమాడితివి। పురు హూతుడప్పుడేపోవద్దటంచు-సరసతపలుమారుచాటించిచెప్పె- వీకతో నా మాటవినకవచ్చితివి। నాకేమి జేసునినన్నునోపెరుగ। విచటనాచారంబులెన్న డు జేసు-నతివేగ నేనెప్పుడంటబోయెదను- తనవల్లబొసగనితప్పులుగలవేయు నియనితలపోసియంతలోరోసి-యింతకాలముగాచియికనేనుబోవ-పంతంబు గాదిదేపట్టునవైన- జేరియాత్రపతినజెల్లింపకున్న- నారయనమ్మగాదంద్రు లోకములు- శనియిట్లుమదిలోననందందదలచు- చునుగాచియుండెనశుద్ధిగో రుచును-నంతటకొన్నాళ్ళకాదమయంతి। కాంతాలలామంబుగర్భంబుదాల్చి సానబట్టినమరుసరమోయనంగ- మానుగానొక్కకుమారునిగనియె- ధరణీ శుడప్పుడుతనతనూభవకు। నరుదారజాతకర్మాదులనెల్ల। నేత్రోత్సవంబుగాని ఖిలంబుదీర్చి-పుత్రికోత్సవమిట్లుబుధులెన్నడపి- చెన్నుమీరగనింద్రసేనా హ్వయంబు। కన్నియకిడెధరాకాంతుడైవేడ్క। నతడశ్వమేధాదియజ్ఞములొన్నె సి-కుటిలులనడచిసద్గుణులరక్షించి-యాచారవంతుడై యతిధర బుద్ధి- భూచ క్రమెల్లనభోరువనేలుచున్నై। నా మాట్కి-నిట్లుండియటుమెకనాడు। వేమారుదా

శనైశ్చరుండు నలునిబట్టుట.

శౌచవిధినల్పునపుడు-మడిమనోకించుకమాత్రంబునీట-దడియకపడియున్నధ ర్మేరుండు। ముదమునసదిదెల్లయుగనిరీక్షించి। యదయుడయితనకార్యమంత యీడేరె। ననపొంగితపదుమేనంతయుదాచి। పనివడిసూక్ష్మరూపమ్ముధరించి। యొడలునుభారమైయుండకనెప్పు- డుడుగకవచ్చోటమాతగానిలిచె- నదిగా నలేడయ్యోనవనీశ్వరుండు- విదితసత్కర్మము ల్వేగదీర్చుచును, నిర్మలచిత్తు డై నెలతయుదాను- ధర్మంబుతప్పకధరనేలుచుండి - యొకనాడునలవిభుడు త్సాహియగుచు-నకలంకరత్నసింహాసనసీమ-నిరుగడహితపురోహితమంత్రి వంశ- గురులుంగొల్వగనిండుకొలువున్న వేళ-కలితనరూపంబుకలినరూపంబు

శనైశ్చరుండుమాయారూపియై నలునివేటకుబోవునట్లుజేయుట.

గలయొకబోయయైయొకనుపట్టైనపుడు-కురుచవెంట్రుకలపైకుళ్ళాయిబెట్టి। గురు తుగాజిగురుటాకులుగొన్నిబట్టి। సారెకుముదురుమీసములనుల్మ్ముచును-భో రునజనుదెంచిభూనాథుగాంచి- చెలువందమింటికిచెయ్యెత్తిమ్రొక్కి- మనల కతినజాతిమాటలననియె-వినుసామినాచిన్నవిన్నపంబొకటి- ఘనమైన దేవర ఘనమైనదొరవు-మేమున్నవనములమృగములపెక్కు-సామికైనగణింప శ

క్యంబుగాదు - మున్న జోతులుమరిమదవు చేసుగులు - దున్నలుసింగములట్లోల
గకయుండు - లేడిపిల్లలుదుప్పులేనూరుకోట్లు। కూడిమిన్నులదాటుకుప్పించిదా
టి - పందులుపందులవెంబడిద్రవ్వుచుండు - గుండేటిగుంపులుకుప్పించుదాటు - నె
లుగులచీమలనెగనిల్చుబుట్ట - బిలములగుహాలందుబెబ్బులుచ్చిరుత - బులులు
గొండ్రిలుచుండుభూరుహాగ్రములు - బెలగువ్వలుగండభేరుండములను - లావు
కల్పిలుకలులకుముకలుజిల్లు - పావురంబులుసాళువవుడేగగములు - పొలుపొం
దుబహుమృగంబులుఖగంబులును - గలవిట్లుమేమున్నకాంతారభూమి - నా
వింతలన్నియేమనివిన్నవింతు। భావించికన్నులపండువుగాగ। మేటిఘోటకమె
క్కిమృగములతోడ - వేటలాడగమీరువేంచేయువలయు - ననవుడుమోదించి
యాత్మనూహించి - యొనరంగవానికిమడుగరలిచ్చి - యరుగుము రేపటిలాలా
గమేము - నరుదెన్చెదము వేటలాడంగననిన - వినిబోయవాడంతవేవేగకదలి -
చనిపురివెడలిఇచ్చటనదృశ్యుడయ్యె - మనుజేంద్రుడంతటమంత్రినిజూచి - యు
మరక్తితో వేటలాడగ్గవలయు - మనము రేపటికిసమ్మదమునయివ ర - ననివ
ల్కుచుండగానంతలోపలను - విపులతేజముమానివెసకప్పుమీరి - యపరభా
గంబునరుగుండుగ్రుంక - జగతీశ్వరుడుకొల్వుజాలించిలేచి - నగరిలోపలికేగె
నయమార్గమునను। పలిరేగియంతలోనాల్గుదిక్కులను - బలువయినచీకటుల్బ
ర్వెనందంద - కలువలువికసించెకమలముల్మొగిచె - తళతళవినువీధితారలుబొ
డమె - నంతటచంద్రోదయంబునిద్దాత్రి - నెంతయువెన్నెలలెసగెనాపిదప - కమ
లబాంధవుడునిక్కముగనీడిశకు - నమరంగనిదెవచ్చుననిపల్కవచ్చు - వేగు
వాడనుబోలెవెలివేగుచుక్క - బాగుగాపూర్వదిగ్భాగంబునందు - చూపట్టె
నంతలోచుక్కలుమాసె - నేవుమీరగపక్షులెసగించ్చగూసె - తరిగెకేళిగు
హాంతరదీపరుచులు। పొరిబొరికుక్కుటంబులుకూయదొడగె - ముదమందితా
మరలుస్త్రముఖములువిచ్చె - పొదలకకల్వగుంపులుచింతనొందె - బొరిపొరిపాములు
పుట్టలజేరి తరుచైనభూతముల్తలచూపవెరచె। దనరినయుండు)నందనవనంబు
నను - ఘనతబూసినకింశుకంబోయనంగ - నరుణోదయంబయ్యెనంతలోపల
ను। ధరణీసురులచేతదాపూజగొనుచు - తపములుహెచ్చునెత్తమ్ములహెచ్చ
తపనుండుపూర్వభూధరమెక్కెనంత - నలరాజుమేల్కనినగరువెల్వడిని - వెల
యుంగసంధ్యాధివిధులొప్పదీర్చి - కుంకుమపన్నీరుగూర్చినగంధ - పంకంబు
తనమేనబాగుగానలది - నలువుగాకస్తూరినామంబుదీర్చి - వెలుగుచువిరిసరు

ల్సిగనిండమరిమి-బిరుసువన్నెరుమాలుపొందుగాజుట్టి- సరిలేనిరత్నభూషణ
ములు బెట్టి- వరుసబంగరువాత్రవ్రాసినజిలుగు- సరిగెదుప్పటిమొలసరుగున
దాల్చి-పాటించికన్నులపండువుగాగ- వేటశృంగారంబు వెలయుంగనించి-య
పరిమితోత్సాహుడగుచునలుండు- విపినయాత్రారభేరి వేయించెనంత- నపు
డుఈబ్రహ్మాండమదరినట్లయ్యె-భూతలమదరెనభోవీధిబెదరె- భీతిల్లెగ్రామ
ములు బెగడెభూతములుజలధులుగలగెనక్షత్రముల్వ్రాలెకులగిరులదరెదిక్కులు
చీలెనపుడు। శత్రురాజన్యులుసకలంబుడించి। మిత్రులడించినమ్మినవారిడించి-
హయములడించిభటావళిడించి - రయమునవారణరథములడించి- కొందరు
కొండలగుహలతిరాటవుల- కొందరుబట్టిరిగుండెలుజెదరి- చపలత ప్రజలుమూ
ర్ఛలనొందిరంత-నపరిమితోత్సాహులయి వేటకాండ్రు- కురచమీసమ్ములు
గుజ్జరూపములు- బిరుసైనమేనులు పెద్దపిక్కలును- చిరుతవీనులు నెఱ్ఱనీర్కక
న్నులును- గురువిందపూసలకొనరొప్ప వేళ్ళు - నెఱిమించతలకించునిలిదట్టు
లును- కురుచకాలెలచెంగుకొనలబిగించి-పట్టుచుంగులుమీద ప్రబలిదనర్ప-
చుట్టుకానులునిండసురియలు జెక్కి- పీడెముల్ మొలజెక్కి-బిరుదుమాష్టీలు
బెనగొందువీనులబిల్లలుగట్టి। కడిదిమొకంబులుగరువకయుండ- తడబడబా[illegible]
లుతరమకయుండ- వలనైనబదనికలాకంట్లువేళ్లు। తలముళ్ళతిరముగాదాల్చి
మేనులకు-తరుచుగామించుదంతపుబిళ్ళలమరు- చిరుతకాసెలువలచెంపలన
మల- వకలబండ్లనుపోగువారుమోకులును- బలువాడిమీరినపందిబల్లెము
లు-జిగురుకోకలుమేటచిక్కములుగా- వెగనలిమబ్బులత్రిప్పుడుత్రాళ్ళు-
పిగిలిచెండ్ళమరినపెద్దఈటెలును ఎండికట్లచేచెలగిసింగిణుల్ - మెలపు
సింగంబులమీదనుగదియ- గలిగిన వటకుక్కలును బంగారు - గొలుసులబ
ట్టించిఘోరావనములు-గలిగిభయంకరాకారులయి వెడలి। రంతటనవ్వసుధా
ధీశుడధిక- సంతోషమునమణిస్యందంబునందు - తనయుండుమంత్రియుదన
స్వామిసతియు- తనుగొల్వగాప్రమోదంబుననెక్కి- భేరివేయించెనుప్ర
వింపింప- వారకదోరలిరువంకలగొలువ- జనకవల్లభుడు వెంటజనుదెంచెన
పుడు- గొనకొనినల్లనికొండలోయనగ-కరమొప్పనవేటకాండ్రువేవేగ-న
కదంబుముందరనందందరాగ- బలుసింగములనయినబారబోసిక- చలమున
గుం[illegible] ల్లారగుంమెదము-పులియయినగవిజొచ్చిపాట్టెలివలెను- ఇలమీ
దబడగుమ్మియాడ్చితెచ్చెదము- మదగజంబులనయినమదములడంచి-పదపడి

విడువక పట్టి తెచ్చెదము - దొరసినిన్ను నబారు సుప్పులనయిన - బిరబిర ఖం
డించి బెరికి తెచ్చెదము - హరివరాహంబులనందందదరిమి - జిరజిర ఖండల చెండి
తెచ్చెదము - పులుల గానముల బోనీక చేతి - బలిమి బల్లెంబుల పాలు జేసెదము -
ధరణీశ యనుచు పంతములాడుకొనుచు - నరుగుచో నెదుట నింపయి మాతు
లుంగ, భల్లాతికీ పారిభద్రమహాధూక - సల్లకీ కురువక సాలహింతాల, బదరి తింత్రి
ణీ బిల్వ పాటలి క్రముక - కదళీ కటాశ్వత్థ ఖర్జూరలుంగ - పనస విప్పల నింబ బంధూ
క సరళ - ఘనసార తాళ మాకంకాదితరులు - ఘనపదకంబు చుక్క - సరాయుడుం
డ - గొనకొరి ముప్పిరిగొనుచు నేలాది - మల్లికాదిక లతన్మహిజకుంజముల - న
ల్లివన విరళ్ళిమయ డగనియిపుల - యడవి ప్రవేశించి యా రాజవిభుడు - కదువడి
మేఘముల్ ఘర్జించినట్లు। ముద మొప్ప శింజినిమ్రోయించెనపుడు। బెదరెమ్ము
గావళి భీతిల్లి కలిగి - పిలపిల చెవు లెల్లి బిక్కరించుకొని పొనసి నల్దిక్కులు జూచు
చుచుండ - పిడుగులకంటెను బెడిదమైనట్టి - కదువాడి తూపులొక్కటనలుండే
య - తనువుల నాటిన తత్తరింపుచును - కొని ప్రాణములు కొన యేటి యేను
గులు - విలవిల ప్రాణముల్విడుచు సంగములు। బలు నెత్తురు దొగి పడెడు బెబ్బులు
లు - పడి మెడద్దెగి నేల ద్రావాలు దుప్పులును - బడి బడి పోలేక బడు గండకములు -
యురములు వెగి నేల దొరుగుదుప్పులును - శిరములు దెగిపడు శిగ్గలీకములు - ప
లుమారు గూయుచు పడెడు జింకలును - తెలియక భయమున దొల్లు నక్క
లును, యవని పైబడి పొరలాడు పందులును - తవిలిన పొదలలో దాగుకుందెల్లు
లీశితి మృగముల నేపడిగించి। ధారుణీశ్వరుడంత దయదాల్చి నిల్చి, వేటగావించి
న వేటకాండ్రడవి - దాటించి పుదిదప్పి రిని బట్టి - ఘనమృగంబుల మీదగది
యుచు ప్రీతి, గొనసేవుల ముసని చికొలిపి బాణముల - పదములు ఖండించి పా
ర్శ్వముల్నరికి। రథములు గెడపి కరంబులు ద్రుంచి। నఖములు దునిమి కర్ణములు
చేదించి - ముఖములు జెక్కి కొమ్ములు నుగ్గు జేసి, నడుములు నరికి చూర్ణంబుగా
విరిచి - తొడల చెండాడి కుత్తుకలుత్తరించి - ముక్కులు చెక్కులు మూపులు త
లలు - పక్కలు బిక్కలు బరులు నుదరులు - కరములు నురములు గాళ్లును వ్రేళ్లు
శిరములు పిరుదులు చెలువ పాలిములు - ఉత్తరించుదియుదినని చెప్పరాక - కత్తుల
పచ్చడి గాగోసిరట్లు - తుత్తుమురై రూపుదోపక కలసి - నెత్తుటి మడుగుల నెరిదేలి
యాడ, పలలొడ్డియ పలొడ్డి నాగులుగట్టి - కలయు మచ్చు సుజల్లి కసుములు గట్టి
రేజాతి పక్షులు యేరీతి బలుకు, నాజాడ పల్కున ప్రదు పిల్చుచును - బాగుదు

త్రాళ్ళనుదెరగొప్పగట్టి- యురులొడ్డిజిగురులనుసురుగాలమూల- సాళువంబు
లమేటిజక్కవంబులను- లాలనలాడెడు లావుకంబులను- కరముల జిలుకల
గోరించపక్షులును- భ్రమయించిపూరేండ్లపావురంబులను। బెలుగువ్వలను
కొంగపిండునసిట్ట। పులుగులనన్నిటిని భోరునబట్టి- వేటచాలించియాపృథివీ
శుకడకు- మేటిబంతంబులు మేటిబల్లులును - కరిసిరంబులలోని ఘనమౌక్తిక
ముల।వరుసతోఁ బునుగుజవ్వాజికస్తూరి- కడువేడ్కఁగొని తెచ్చి కానుకలియ్య
తడయకననియెల్లదమయంతికిచ్చి- పరగంగవానికిబహుమానమిచ్చి- ముదు
పునదనమంత్రిమోమువీక్షించి। నలవులనీవేటతమకంబువలన-తలకొని మన
మెంతదవ్వువచ్చితిమి- యనుచునుదనపురికరుదెంచునెడను- దనరినవనిదేవ
తలవేడ్కఁజూచు-బాగయినవిద్ధంపుస్ఫటికదర్పణము-లాగునవీలోత్పలంబుల
చేత-తరుచయినకమ్మకెందమ్ములచేత। మెరుగులనీలపుగుడ్లుమెచ్చగతీరు-మె
రయించుమేటితుంమెదదుంపుచేత- గరమొప్పమంచిచెంగల్వచేత- పయిడిరె
క్కలుగలపక్షులచేత-వాడిగోకులగోరవంకలచేత-బలువుగానున్నట్టిబకము
లచేత-సలలితంబుగక్రౌంచసంగంబుచేత- క్రమమొప్పచక్రవాకంబులచేత-
రమణీయమైతదారావనింద్ర-కలకలశబ్దసంగతమైనయొక్క- కొలనుగనుం
గొనికువలయేశ్వరుడు-తరుణియుదానునత్తరితేరుడిగ్గి- కరతలంబునమంత్రిక
రమూదుకొనుచు-జలజాకరముజొచ్చిజలములగ్రోలి- యలరంగనచ్చోటన
తిచిత్రముగను- చెలువుమీఱగజగజంపుగప్రజలి- విలసిల్లుసహకారవృక్షం
బునీడ-నరసిజపత్రముల్లాలంగనెరసి- యిరవుగాతలిరాకునొనరంగజేసి- ప
రచినమృదుచారపానుపుమీద, ధరణీసురుడతులమోదంబుతోడుతను-తల
పునదమయంతి దమయంతితోడల - తలగడగా జేసి తగవిశ్రమిన్చి- గురుతు
గామరువంపుకొనలనవచ్చు-సురటివటువ్రివగాలినుడియుంటదిప్ప। నలతతోక
నుమోద్చునంతలోపలను - కవిగియొప్పసికగనిమేలుకాంచి- దిగ్గునలేచినల్ది
క్కులుజూచి, యగ్గలంబుభీతినందందవడక-నమాన్యనవాధీశుడప్పుడుచూచి-
యంమానినీమణియతిభక్తితోడ- నరుదయినకెందమ్మినలరించుముద్దు- కర
మున చెలువందగావీవుజరచి-రమణీయమగునవరత్నకంకణము- రమణుకప్పు
డురతనగాగట్టి- యిదియేమివెరచితియినకులాధీశ - మదిలోననీవుసామాన్యు
డవనెను- వక్రంబునీభూమివసియింపనిక- చక్రంబుపనిశేయజగమునేలుదు
వు- ఘనుడవునకలలక్షణగుణోన్నతుడ- వసుపమజయశాలివర్యవంశజుడ-

వనితన్ను దెలిపినయాపుష్పబోణి- గనుగొనినలమహీకాంతుడిట్లనియె- నెల
నాగయేమనయెరుగంగరాదు- కలగకకొలగానికలగంటినిపుడు - తెలియజె
ప్పెదదాని తెరగెల్ల వినవే- యలివేణియారాజ్యమంతయుమనము-విడిచివేద
లబొందివిపినంబులోన-నుడుగకనిర్ద మొకచీరగట్టి- పరువడిబాధలగొంతకా
లంబు- మరిగినపిదపశ్రీహరికటాక్షమున- మనమురాజ్యసుఖాప్తిమనగంటిని
ష్ట- డనియిట్టిదుస్స్వప్నమధిపతిజెప్ప- వెరచిదావెరనివిధమునబలికె। న
రయంగదీనికినడలనేమిటికి-నందులకేమిశ్రీహరియాజ్ఞమీరి - పొందునేదుః
ఖంబుభూతలాధీశ- సత్యమేజయమనిసకలశాస్త్రముల-నిత్యంబుగాబల్కి-ని
ఖిలంబులోన।నిటుగానసత్యంబునధికధర్మంబు-పటుగతిభాగ్యంబుసంపదగల్గె
మనకు-ననియిట్లగామోయవాణినాకాశ- ధారుణీనాధుండుతనపురికరిగె।
వెలయుచుకలిమాయవేగొకవేళ- తెలిసియుదెలియని తెరపుననుండ- భీముని
వరపుత్రిబిసరుహనేత్రి - భామాలలామనిర్భరగుణోద్దామ- పరమపతివ్రత
బహుధర్మనిరత వరరూపవిభవలావణ్యప్రహరి- దమయంతిసత్యంబుదరలం
గనీక- నమరినవేడ్కతోనప్పటప్పటికి- తనప్రాణవిభునకుధర్మశాస్త్రముల-
ననురక్తిజెప్పగానతడుసత్యమున- చెలువందరాజ్యంబుచేయుచుండె- కలి
రాజుమరికొంతకాలంబువెనుక-మనమునదలచియుమ్మనునాయకుని- ఘన
ముగానేదన్నకపటజూదమున - కలరాజ్యమెల్లనక్కటలవోడించి - తొలగి
జేసెదతొల్త కానలకు-నలనాడుధరణీధరారాతితోడ-బల్కినపత్రంబుబ్రబ
లజెల్లింతుననియొక్క చెనటిబ్రాహ్మణరూపు దాల్చి।తనుదోచువారలందరున
వ్వచుండ-కురుకుసల్లనిమేనుకరినస్వరంబు।కుచుచపాపంబులక్రూరదంష్ట్రల
ను- విల్లువంకలకాళ్ళుపిగిసినబొమల-పల్లమీసంబులొప్పనిగుంటకనులు- న
రసినగడ్డంబునడ్డినసికయు- బహువుగాబట్టినపట్టవర్ధనము- కడిదిబింబోష్ఠం
బుకడుబొక్కినోరు-నిమపయునమెడయునునిక్క-సరొమ్ము, బలువునామాసిన
పాతధోవతియు, వెలయగచేనొక్కవేయుదండంబు-వలనుగాజిగిముడివైచు
జందెంబు- కలిగిభయంకరాకారుడయినలుని-దాయుపుష్కరుడనుధారుణీ
నాథుడావెడతనవారలందరుగొలువ।బొలుపొందతనపురంబునచిత్రమలర
గొలువున్నయత్తరి గొబ్బునబోయి - భుజగంబుకయిపడి బొడగాంచియత
ని-విజయోస్తుయనుచుదీవించియిట్లనియె- నన్నెవ్వడోయనినరనాధబుద్ధి-నె
న్నకుకలియనివొపుగుమునన్ను-దురితకర్మములకుడొరవగునాకు-సరియైన

శనైశ్చరుండు పుష్కరునితో నలునియొద్దకేగి జూదంబాడుమనుట.

వాడుము జ్జగముల లేడు - హరిహర బ్రహ్మాదు లైన నితరులకు పెక్కు బాధ
ల బెట్టువాడ - మనుజేశ నన్ను సామాన్యుడనందు - నొనరి మీమతిలోన నుం
చకు మెపుడు - విరసత నతడేమి వెర బెట్టదలచి - యరుదెంచెనో యని యడలకు నీ
వు - పన్నుగా నీకొక్క పని చెప్పదలచి - క్రన్నన నేను నీకడకు వచ్చితిని - యని మ
రి వేవేగ నా పని సేయ - మని నీవు వినకున్న మాచిత్తమొదలు - నవనీశ యా కార్య
మెంతయు నిపుడు వివరంబుగా నీకు వివరింతు నింక - నలివేణి దమయంతి యని మె
డు కాంత - కలదొక్క యువతిచక్కని ముద్దుగుమ్మ కలి సాక్షి పుట్టిననాటనుం
డియును - యలరుచు నే బెండ్లియాడెద ననుచు - కాచుచుండగ నన్ను కాదని మి
గుల - నా చంద్రముఖి బెండ్లియాడి మాణిక్య - ములవంటి యిద్దరు ముద్దుబిడ్డల
ను యలరంగ గాంచి యీ యవని రాజ్యంబు నేలుచున్నాడు నన్నెంచక నలుడు
తాలిమి గొందుచిత్తం బిట్టి పనులు - సరిపోయి యుండు నే జగతి నెరికిని - యరు
దెంచి నే పెండ్లియాడెదు దాని - నెలమి దానువరించ నెంతటివాడు - బలభేదిక
న్న దిక్పాలురకన్న నరనాథ ధారుణీనాథులకన్న సరసత నాకన్న చక్కనివా
డో నలుడంచు వాని యా నాతి వరించె - నిలతలాధీశునికిది సమ్మతంబె ఎంతైన న
లుడు నా యిష్టమారయక, నింత కార్యము చేసెనికి కూడునైన నేమా యవేవే
గ నిట్టి జూదంబు నా మహీశునితోడ నాడుము నీవు చెలువందవాని పాచికలలో
నుండి - నిలిచి యోడింతు వేనిఖిల రాజ్యంబు నేకచక్రనుగాగ నీయిల నెల్ల చే
కొని వేడ్క నీ చేత నేలింతు నన్ని కార్యంబుల కలరుచు సేన - యున్నాడ నీకేల ను
ర్వీశ భీతి - యనవుడు సంతోషమంది పుష్కరుడు - వినయంబు చేక లి వేల్పునకని
యె - పాపగంగ యేను నీ బుద్ధులు దాట - వసుమతి నే నెంతవాడనో దేవ - యా
రూఢి జూదంబులాడెద ననుచు - నారాజకడకు నే నరిగితి నేను - సరసత నలుడన
సముడనటంచు - నెరిగి నాతో పంతమిడి భ్రష్టనట్లు లాడు నే జూదంబున తడువద్ద
నక వేడుకతో డుతీన మేను జనిన - ననవుడు నే వాని యాత్మలో నుండి - యను
రక్తితో జూదమాడెడు బుద్ధి బుట్టింతు వేవేగ బొమ్ము నీ కేల నిట్టి విచారంబు లేగ
తినైన - వానితో సరిపోరి వాని రాజ్యంబు - పూని నీకియ్యక పోను నీయాన - చెలు
వొంద రాజ్యంబు సేయుమటంచు, కలికి యదృశ్యుడయి పాపపల్లభుడు - జనియె
నా నలమహీశ్వరుడొక్క నాడు - మన సెలర్పగ సభామంటపంబునకు - చనుదెం
చి సకల రాజన్యులు భటులు - ఘనమైన మంత్రిపుంగవులు బాంధవులు - హితుల

గాయకపురోహితులునాశ్రితులు। సతివేడ్క గొలువసింహాసనమందు। నమ
రంగగూర్చుండినతివేడ్కతోడ। రమణులువింజామరంబులువీవ। వారకభ
టులుకయివారముల్సేయ।సారెకుసజ్జనుల్ సన్నుతిసేయ। కవివన్దిమాగధుల్
గడగికీర్తింప। ప్రవిమలసకలసంపదలచేనిట్టు। దివిజులతోనున్న దేవేంద్రుప
గిది।కువలయేశుడునిండుకొలువున్న వేళ।జననాథుకడకుపుష్కరభూవిభుండు।
తనవారలెల్లమోదంబునగొలువ। చనుదెంచియతనికిసద్భక్తిమ్రొక్క - వి
నుతులుసేయనవ్విభుడుపుష్కరుని, యనుపమగతినొక్క యాసనము
న-నునిచినయాడించినుచితవాక్యముల।బరిసామమేయనిపార్థివునడుగ।హరి
కటాక్షంబుననందందమాకు।ఘనతరసౌఖ్యంబుగల్గునెల్లప్రుడు। మనుజాధినా
యకమరినీకుశుభమె। యనవుడునీదయనవనీతలేశ- యనుపమసుఖముగాక
సుఖంబుగలదె।యనవుడునిషధభూమీశుడిట్లనియె। నెనయగపుష్కరాధీశు
నిజూచి। ధరణీశనీవేమితలపునదలచి।కరమొప్పనేడుమాకడకువచ్చితివి-యె
న్నడురావునీవుతెంచుటరుదు। క్రన్ననవచ్చినకార్యంబుచెప్పు। మనవుడుపు
ష్కరుండవనీశుజూచి।గొనగొనినినుజూడగోరివచ్చితిని। ఇదియొంతకానియొం
డేమియులేదు। ముదమందిమనలోనముచ్చటదీరి। మనమిద్దరముగూడిమరివే
డ్కజూద। మనుచక్తిమీరంగనాడుదమనిన। ధరణీతలేశుండు తలయూచిప
లికె। ధరలోనమూకుమ్మదంబాడతగదు। ప్రవిమలసత్యసంపదబాసిపోవు। న
విపేకమొలయుదులాగ్రహంబొదవు। నటుగానజూదంబునాడంగతగదు। యి
టువంటిపనిసేయునవాణమేమునకు। ననిపల్కుచుండగానప్పుడుకలియు। మన
మునప్రేరేపమదిజూదమాడ।గోరినప్పాడమిమక్కువలనాధీశుని। గారవించి

పుష్కరుండు నలునితో జూదంబాడుట.

నలుండుకడకనిట్లనియె। పగడసాలాడంగ బ్రహుదంబునొంది। జగధీశయిచటికి
చనుదెంచినపుడు। నినుచిన్నబుచ్చగానీతిగాదింక।ననురక్తియొకయాటయా
డుదమనుచు। మేలిమిపైడినిమిర్చినపగడ। సాలదెప్పించియచ్చటనక్కప
రచి।తి మొప్పగానాల్గుదిక్కులయందు। సరగునసారెలుచక్కగానిలిసి-యె
నరంగపందెమేమునినలుండిట్లు-లనినిపుష్కరుండనియెనవ్వుచును। ఇనకులా
ధీశ్వరయేనోడితేని।ననిబూనియేలుమీబంటనయ్యేదను। నేపునవెరుగకనీవో
డితేని। నీరాజ్యమంతయునెమ్మినాకొసగు। మనినిట్టియొడబాటు కాత్మలో
మెచ్చి।ననుకొన్నవేడ్కతో వెలయపుష్కరుని। తోడరిజూదంబాడదొడగిన

లుండు।తడయక మేటిదంతపు పాచికలను। యమరించియొక బాటి యును చదో
ర్చించి। సమముగాడుగ దచ్చిచౌపంచపగడ। యిత్తుక తానివారలిరువురునా
డ।న త్తరిపాచికలందుండిమరియు। కలినలధారుణీకాంతుని చేత। బలుమారు
పందెంబుపడకుండ జేయ। నలుడదిచూచివింతగదాయటంచు। చలముకోపం
బురోషంబునీమూడు। ముప్పిరిగొనగనాయురువుననాడ। నప్పుడుకలిమాయ
యనిగానలేక- సరిలేనిమత్తగజంబులనోడె। కరికరిగజతురంగంబులనోడె।క
డగినిండినధాన్యకణజంబులోడె। పసగల్గుబంగారుపల్లకిలోడె। మసలకఛత్ర
చామరములునోడె।రంగయినదివ్యాంబరంబులునోడె। సంగీతముల బాడుసఖి
యలనోడె,కొమరారుముత్యాలగొడుగులనోడె,రమణీయమగుధనరాసుల
నోడె। వారకభటజనవర్గంబునోడె। తేరులనోడె మేదినియోడుటెరిని,సచివుండు
మదిలోనసన్తాపమంది।యుచితవాక్యంబులనుర్వీశుతోడ।ననియెధారుణీయం
దునోడె యనఘులకిట్టిదుర్వ్యసంబుగలదె. యిది యేమిపనియిప్పుడుదోచె.
మదిలోననిట్లాడమరచి తేసితి, జూదమాడుట యేమిపౌరుషము రాజేంద్రనగ
రికిరండుపోవలయు, నదెనిన్ను చెలులురమ్మనిపిల చెదరు- యిది వేళగాదునీవిం
తటనిలువు,ధరణీశయాకలిదప్పులుమరచి।తరలకయాడంగధర్మంబుగాదు.
లేతెమ్ముయాటచాలింపుము వెనుక. నాలాగ వేం చేసియాడెదుగాక.ననిపల్కి
చెయిపట్టియవతలికిదీయ-కనులనెర్రగ జేసికసుగాంచిసింహ. మూరకజూచిన
రీతినూరకజూచి, పరువడిగర్జించిపలికెభూవిభుడు. నీ కేలనిటువంటినీతులు
చెప్ప. చేకొనియెవ్వరుచెప్పిరమ్మనిరి। విడువిడుమని చెయ్యివిడుపించుకొనుచు
నుడుగకకలిమాయసోగియాడదొడగె, నప్పుడుచింతించియామంత్రివరుడు.
తప్పకనలుడుజూదంబాడు తెరగు. చేరివద్దనిబుద్ధి చెప్పినవిధము. ధారుణీవా
క్కటిదక్కనంతయును. యురువడితోడుతనోడిన తెరగు. చేరివద్దనిబుద్ధి చె
ప్పినవిధము. ధారుణినొక్కటిదక్కనంతయును. యురువడితోడుతనోడిన తెర
గు. కెరలియాతడుకోపగించిన తెరగు। దమయంతికప్పుడు తగజెప్పిన చె-
దమయంతియపుడు సంతాపంబునొంది. యిది యేమిపనివచ్చెనిక నేమిసేతు-
వదలకతనమంత్రివాక్యంబువినక, సదయుడయి ఈరీతియాడినయపుడె,యిది
దయివమాయయొండేమియునంచు. మదిలోననికననుమానంబువలన. దిది
యాదిగానింక నెట్టిదుఃఖంబు, పొదవియేగతిమిమ్ముపొందనున్నదియొ.పదవడి
దుస్స్వప్నఫలమెల్లనిపుడు. డదియేలనోనిచ్చనుభవించకను. మగూట్ల నేమ

నివారించెనోయన్న బ్రహ్మ తను జేయపూర్వకృత్యంబును దాట. వనజాసనా
దిదేవతలకువశమె. యిటువంటిజూదంబు లెవరయినయన్న. తటుకువనాడి కే
ధరణిలోననుచు, నప్పుడువార్ష్ణేయుడనెడుసారథిని. తప్పకరప్పించితగనంత
చెప్పి, కొడుకునుకూతునుగొని వేగనీవు. తడయకమాతల్లితండ్రులవద్ద. విడి
చియిక్కడనున్నవృత్తాంతమెల్ల కడు వేగనెరిగించికదలిరమ్మనిన. నరునయిన
యొక మేటియరదంబుమీద, నిరువురుబిడ్డల నెలమినెక్కించి. పరువునదోడ్కొ
నివార్ష్ణేయుడపుడు, పరగంగయావిదర్భపురంబు జేరె. నప్పుడుపురమువారం
దరుగూడి, తప్పకతమలోనతాముచింతించి. తలపోయ దొడగిరిధారుణీశ్వరు
డు. చెలువందరాజ్యంబుచెయుచుండగను సకలజనావళిసంప్రీతిబొందె, నిక
నెట్లకో యెరుగంగ రాదు, పోడిమిమనమయినపోయిజూదన్ను, నాడన్గవలదని
యరసి చెప్పదము. మనమునతనమంత్రిమాటలువినిన. మనుజనాథుండుమన
మాటలువినునె. పూనిశుభాశుభంబులు రెండుతనవి . యనియుని దెలియక
నాడుచున్నాడు-జూదంబునాడెడుచోరపుష్కరుని. వాదించిపోనీకలువారు
లేరయిరో. యలరిభూపతిజూదమాడంగబోవ. వలదంచు పెద్దలెవ్వరు జెప్పరై
రో. యవనీశయీజూదమాడరాదనుచు, నెవరయినభూజను లెరిగింపరయిరో
ఘనమైనకర్మముల్ గదసీనవెనుక. వినవచ్చునేయదివిఘ్నవకయిన! నైననుమన
మిప్పుడ దరిమేగి. మానుమీజూదంబుమను జేశయనుచు. పలుదెరంగుల జే
రిపలుకుదమొగిని- చెలరేగిమనమేమి సేయబోయెదము జూదమాడుటవసి
ష్టు డెరిగియున్న. కావనిమాన్ప జేకష్టజూదంబు. నికనైననమ్మవు నీవిటకేగు
దెంచి. యకలంకమతితోడనారాజుగాంచి! యాడగూడదుజూద మాడకు
మంచు- నేడుజెప్పినగానినిలువు నేరాజు. మనమాటనిపుడుసమ్మదమునవినునె
యనిపౌరజనులెల్లననుమానమునను జనిచనినలరాజచంద్రునిగాంచి మును
కొనిభయమునమ్రొక్కియిట్లనిరి . మానవాధీశ్వరమమ్ముగావలసి . మాను
మీజూదంబు మదినమ్మరాదు - కపటమైయున్నది గానయీజూద - మి
ప్రుడుజాలింపుమాయిందరితోడ - పైరానివని సేయువలయునేరికిని - యవనీ
శ గెల్పు లేదయ్యెనింతైన! తవిలియాటమించెతగదింకవిడువు!మనవుడువారల
నవుడాగ్రహించి- కనుగొనిచెవ్వొత్తిగర్జించిపలికె - జేరినాకునుబుద్ధి జె
ప్పుమటన్న- వారెవ్వరనుచుదుర్వారోగ్రుడగుచు- కలియుక్తుడగుచు నాక
లిగొన్నయట్టి- పులిబోలెగర్జించిపోదోలెప్రజల- నీరీతిబ్రజలంత రేగివెన్ను

